# బొమ్మరిల్లు

7/86

సంపాదకుడు : విజయ బాపినీడు

బలహీనతపై దెబ్బ కొట్టి తన కార్యాన్ని సానుకూలం చేసుకోవాలనుకొనే వ్యక్తి, ఎంత గొప్పవాడైనా, వెర్రి వాడితో సమానం. అతడు చేసిన మోసం ఎదుటి వారికి తెలిసినప్పుడు అతణ్ణు గడ్డి పూచ క్రింద జమ కట్టి నిజంగా గడ్డి పూచే అని తేల్చి పారేసే తీవ్ర ప్రయత్నం చాటుగా చేయబడుతుందనీ. చివరికి తాను మట్టి కరిచాక కాని అతడికి ఆ విషయం బోధపడదనీ ఈ నెల కరాళ కథ ['వసంతసేన'] లో చక్కగా వివరించబడింది.

విమర్శ అనేది ప్రతి చోటా కుండ బద్దలు కొట్టినట్లు వుండకూడదనీ, తాము సాధించాలనుకున్నది నిర్మాణాత్మకమైన పొగడ్త ద్వారా సాధించటం విజ్ఞుల లక్షణం అనీ మరో కథలో గ్రహిస్తాం.

సంపుటి : 15 జూలై 1986 సంచిక : 11

విడి ప్రతి: రూ. 2-50 సంవత్సర చందా : రూ. 30-00





# చ్యవనుడు

పులోముడనే రాక్షసుడికి చాలా కాలంగా పులోమ అనే కన్య మీద మక్కువగా వుండేది. ఒకసారి ఆమెని తనకు ఇచ్చి వివాహం చెయ్యమని ఆమె తలిదండ్రుల్ని అడిగాడు పులోముడు. తమ కూతుర్ని రాక్షసుడికి ఇవ్వటానికి ఇష్టపడక, మహా తపస్సంపన్నుడైన భృగుమహర్షికి ఇచ్చి, వారు వివాహము చేశారు. ఇది పులోముడికి కోపహేతువు అయింది.

ఒకనాడు భృగుమహర్షి ఆశ్రమంలో లేని సమయం చూచుకొని, పులోముడు వరాహ రూపాన్ని ధరించి, గర్భిణిగా వున్న పులోమను ఎత్తుకొని పారిపోబోయాడు. పులోమ బిగ్గరగా రోదిస్తూ, పెనుగులాడింది. ఘర్షణలో పులోమ గర్భం చెదిరి, ఒక బాలుడు పుట్టుకొచ్చాడు.

ఆ బాలుడి పేరే చ్యవనుడు. దివ్య తేజస్సుతో పుట్టిన ఆ బాలుణ్ణి చూడగానే, పులోముడు భగ్గున కాలిపోయాడు.

పుట్టగానే, రాక్షసుణ్ణి భస్మీపటలం చేసిన చ్యవనుడు, తండ్రి ఆజ్ఞ ప్రకారం వైడూర్య పర్వత ప్రాంతానికి వెళ్ళాడు. అక్కడ ఒక సరోవరం దగ్గర తపస్సుకు పూనుకొన్నాడు. అన్నపానీయాలు మరచి అనేక సంవత్సరాలు మహా తపోనిష్ఠలో వుండి పోయాడు. దేహంలో జవసత్వాలన్నీ కృశించి, వృద్ధుడు అయ్యాడు. అతడి శరీరం చుట్టూ పుట్టలు లేచాయి.

శంయాతి అనే రాజు భార్యా సమేతుడై, కుమార్తె సుకన్యను వెంట బెట్టుకొని, జల క్రీడల కోసం ఈ సరోవరం దగ్గరికి వచ్చాడు.

సుకన్య తన చెలికత్తెలతో అరణ్యమంతా విహరించి, పుట్టలలో వున్న చ్యవనుడి వద్దకు వచ్చింది. పుట్టలలో వున్న చ్యవనుడి రెండు కళ్ళు మాత్రం మెరుస్తూ కనిపించాయి సుకన్యకు. అవి మిణుగురు పురుగులనుకొని, పుల్లతో పొడిచింది ఆమె.

తపోభంగమైన చ్యవనుడు కోపంతో శంయాతి సైన్యానికి కడుపునొప్పి కలిగేటట్టు



శపించాడు. "సైన్యం పడే బాధను చూచి రాజు అయోమయంలో పడ్డాడు. అప్పుడు సుకన్య తండ్రి దగ్గరికి వచ్చి, తాను చేసిన నీచకార్యాన్ని చెప్పింది విచారంగా.

రాజు వెంటనే పుట్ట దగ్గరకు వెళ్ళాడు. చ్యవనుడిని తమ తప్పును క్షమించమని వేడుకొన్నాడు.

చ్యవనుడు శాంతించి. "సుకన్యను నాకు ఇచ్చి వివాహం చేస్తే క్షమిస్తాను," అన్నాడు.

వృద్ధుడైన చ్యవనుడిని వివాహం చేసుకోవటానికి సుకన్య మనస్ఫూర్తిగా అంగీకరించింది. రాజు సంతోషించి, వెంటనే ఇద్దరికీ వివాహం చేయించి, తన రాజధానికి వెళ్ళాడు.

నాటి నుండి సుకన్య వృద్ధుడైన చ్యవన మహర్షిని సేవిస్తూ జీవించ సాగింది.

ఒకనాడు అశ్వినీదేవతలు సుకన్యను పరీక్షించాలని, సుకన్య దగ్గరికి వచ్చి, "ముసలివాడైన చ్యవనుడితో బతుకుతూ, అందాన్ని వృధా చేస్తున్నావ్. ఇప్పుడైనా మించి పోయింది లేదు. ఎవరైనా అందగాడిని కోరుకో. తీసుకు వస్తాము," అన్నారు.

వాళ్ళ మాటలకు సుకన్య కోపంతో మండి పడి వెళ్ళి, భర్తతో ఆ విషయం చెప్పింది. చ్యవనుడు బాగా ఆలోచించి. వాళ్ళు చెప్పినట్టే చెయ్యమని ఆదేశించాడు.

సుకన్య అశ్వినీదేవతల వద్దకు వచ్చి, ఒక నవయౌవ్వనుణ్ణి తెమ్మని కోరింది. వారు ఒప్పుకొని. సమీపంలో వున్న సరస్సులో స్నానం చేసి, నవ యౌవనుల్లాగా బయటికి వచ్చారు. వెంటనే చ్యవనుడు కూడా నదిలో మునిగి, నూతన యౌవ్వనుడై. బయటికి వచ్చాడు.

ఒకేలాగా వున్న ముగ్గురు యువకుల్లోనూ సుకన్య తన భర్తను సులభంగా గుర్తించింది. అశ్వినీదేవతలు తృప్తి చెంది. ఆమె పాతివ్రత్యాన్ని పొగిడి వెళ్ళి పోయారు.

అశ్వినీదేవతల వలన తనకి ఇలా నూతన యౌవ్వనం ప్రాప్తించిన తర్వాత, వాళ్ళకి ప్రత్యుపకారం చెయ్యాలని నిశ్చయించుకున్నాడు చ్యవనుడు.

అశ్వినీదేవతలు బృందారకులు కానందు వల్ల, వాళ్ళకి సోమపానం చెసే అర్హత లేదు.



వాళ్ళకి సోమపానం దక్కేటట్టు చేస్తానని ప్రతిజ్ఞ చేశాడు చ్యవనుడు.

తన మామ అయిన శర్యాతి రాజుతో, "యజ్ఞ సంబారాల్ని సిద్ధం చేస్తే, మీ అభ్యున్నతి కోసం క్రతువు ఒకటి చేస్తాను," అన్నాడు చ్యవనుడు.

రాజు సంతోషంగా అన్నీ సమకూర్చాడు. చ్యవనుడు సుకన్యతో యజ్ఞం ఆరంభించాడు. హవిర్భాగం కోసం వచ్చిన ఇంద్రుడితో పాటు అశ్వినీదేవతలకు సోమరసాన్ని ఇచ్చాడు చ్యవనుడు.

అందుకు ఇంద్రుడు కోపించి అడ్డు తగిలాడు. చ్యవనుడు ఇంద్రుణ్ణి ధిక్కరించి, అశ్వినీదేవతల చేత సోమపానాన్ని చేయించాడు. ఇంద్రుడు కుపితుడై చ్యవనుడి పైకి వజ్రాయుధాన్ని ప్రయోగించాడు. చ్యవనుడు తన మంత్రశక్తితో వజ్రాయుధాన్ని అగ్నిలో పడేటట్లు చేశాడు.

అప్పుడు అగ్ని గుండం నుండి మదుడు అనే రాక్షసుడు భీకరాకారంతో ఉద్భవించి ఇంద్రుణ్ణి మింగబోయాడు. దానితో భయకంపితుడైనాడు ఇంద్రుడు. క్షమించమని చ్యవనుడి పాదాలపై పడ్డాడు. అంతేకాదు, అశ్వినీదేవతలు ఇక నుండి సోమపానానికి అర్హులేనని అంగీకరించాడు ఇంద్రుడు.

అప్పుడు చ్యవనుడు శాంతించి, ఆ రాక్షసుణ్ణి వారించాడు.

'బ్రతుకు జీవుడా!' అనుకుంటూ వెళ్ళిపోయాడు ఇంద్రుడు.

నవయౌవ్వనుడైన చ్యవనుడు సుకన్యతో ప్రశాంతంగా గృహస్థ జీవితాన్ని చాలా కాలం గడిపాడు. వారికి దధీచి, ప్రమతి, అప్రవానుడు అనే పుత్రులు జన్మించారు.

ఆ తర్వాత చ్యవనుడు తన మిగిలిన జీవితాన్ని తపస్సులో గడపాలని నిశ్చయించుకున్నాడు. భాగీరథీ, యమునా సంగమ స్థానంలో, ఉదకవాస మహా వ్రతాన్ని చేపట్టి, నీటిలో వుండి తపస్సు ప్రారంభించాడు చ్యవనుడు.

ఇలా కొన్ని సంవత్సరాలు గడిచాయి.

ఒకనాడు జాలరులు చేపలు పట్టటానికి

వలను నదిలోకి విసిరారు. ఆ వలలో చ్యవనుడు చిక్కుకున్నాడు. అతణ్ణి చూసి జాలరులు వణికి పోయారు.

"ఓరీ! మీ కులవృత్తిని మీరు చెయ్యటంలో తప్పులేదు. మీ చేపలతో పాటు నన్ను కూడా విక్రయించండి," అన్నాడు చ్యవనుడు.

జాలరులు పరుగున వెళ్ళి, ఆ దేశపు రాజైన నహుషుణ్ణి తీసుకొని వచ్చారు.

అప్పుడు చ్యవనుడు, "నా వెలని నిర్ణయించి, ఆ ధనాన్ని ఈ జాలరులకు ఇవ్వు రాజా!" అన్నాడు.

"నా రాజ్యాన్ని మొత్తం ఇస్తాను," అని నహుషుడు అంటే, అది తనకు తగిన వెల కాదని నిరాకరించాడు చ్యవనుడు.

అప్పుడు కవిజాతుడనే ముని అక్కడికి వచ్చి, "గోవూ, బ్రాహ్మణుడూ సమానులే కాబట్టి, ఒక గోవును ఇవ్వు," అని నహుషుడికి సలహా ఇచ్చాడు.

అందుకు చ్యవనుడు సంతోషంతో ఒప్పుకున్నాడు. వెంటనే నహుషుడు ఒక గోవును తెప్పించి, జాలరులకు ఇచ్చాడు. జాలరులు ఆ గోవును చ్యవనుడికి సమర్పించి, తమకి ముక్తిమార్గం చూపమని వేడుకొన్నారు.

సంపన్నుడై చ్యవనుడు అందుకు అంగీకరించి, తనతోపాటు వలలో చిక్కిన చేపలకూ, జాలరులకూ స్వర్గలోక ప్రాప్తి కలిగేటట్టు అనుగ్రహించాడు. అందరూ ఆశ్చర్యంతో చూస్తూ వుండగా, ఆకాశం నుండి ఒక దివ్య విమానం కిందికి దిగి వచ్చి జాలరుల్ని, చేపల్ని స్వర్గలోకం తీసుకొని వెళ్ళింది.

చ్యవనుడు నహుషుడి ధర్మగుణానికి సంతోషించి, "ఓ రాజా! నీకు ఇంద్రపదవి లభిస్తుంది," అని ఆశీర్వదించి, మరల తపస్సుకు వెళ్ళి పోయాడు.

ఆ ఆశీర్వచన ఫలంగా నహుషుడూ ఇంద్రపదవిని పొంది స్వర్గలోకాధిపతి అయ్యాడు.





# ముందుచూపు

పూర్వం ఆఫ్రికా ఖండంలోని ఒక చిన్న దేశంలోని మారుమూల గ్రామంలో మషీలా అనే చక్కని చిన్నది ఉండేది. ఆమెను పెళ్ళి చేసుకోవాలని ఎందరో యువకులు ఆశపడు తున్నారు. మషీలా మాత్రం హోటంగా అనే సోమరిపోతు యువకుడిని ప్రేమించింది.

హోటంగా లాంటి సోమరిపోతుకు మషీలాని ఇచ్చి పెళ్ళి చేయటం ఆమె తండ్రి కిష్టం లేదు. మషీలాకు హోటంగా సోమరి పోతు కాదని ఋజువు చేయాలని ఉంది.

అందుకు ఆమె బాగా ఆలోచించి, తనను ప్రేమించిన యువకులు అందర్నీ పిలిచి, "నేను ఎలాగూ మిమ్మల్ని పెళ్ళి చేసుకోను. మీరంతా కలిసి ఏదైనా ఘనకార్యం సాధించి, అది హోటంగా సాధించినట్లు నా తండ్రికి చెప్పాలి. అప్పుడే మీకు నాపైన ప్రేమ వున్నట్లు. మీ ఉపకారాన్ని నేను సదా గుర్తుంచుకుంటాను," అన్నది.

ఆ యువకులు సరేనని ఒక రోజున హోటంగాను తీసుకుని పోయి ఊరి చివర కొండ ప్రాంతానికి వెళ్ళారు.

కొండకు అవతల మరో గ్రామము వున్నది. ఆ గ్రామం చేరటానికి గ్రామస్థులా కొండను చుట్టి వెళ్ళ వలసి వస్తున్నది. కొండలో సొరంగ మార్గం ఒకటి వున్నది. కాని, అది పెద్ద పెద్ద బండరాళ్ళతో కప్పబడి పోయింది.

యువకులు హోటంగాతో, "మషీలాపై ప్రేమను పొందిన నీవు చాలా అదృష్టవంతు డివి. ఈ సొరంగంలోని బండరాళ్ళను అన్నిం టినీ తొలగిస్తాం. నువ్వేమో ఆ పని నువ్వు ఒక్కడివే చేసినట్లు మషీలా తండ్రికి చెప్పు. మేము సాక్ష్యం వుంటాం," అంటే హోటంగా అందుకు సంతోషంగా అంగీకరించాడు.

యువకులు పని ప్రారంభించి నాలుగు రోజుల్లో కష్టతరమైన సొరంగమార్గాన్ని సాను కూలం చేయగలిగారు.

తర్వాత వారు హెూటంగాకు జయ జయ ధ్వానాలు పలుకుతూ ఊళ్ళోకి వెళ్ళి మహీలా తండ్రిని కలుసుకుని జరిగింది చెప్పారు.

మహీలా తండ్రి ఆశ్చర్యపడి, "ఆ సోమరి పోతు హెూటంగా ఇంత పని చేశాడంటే నమ్మటం కష్టం. అయినా వాడికి ఆ అవసరం ఏముంది?" అని అడిగితే యువకులంతా ఏక కంఠంతో, "మహీలాపై ప్రేమ!" అన్నారు.

ఊరంతా వెళ్ళి ఆ సొరంగమార్గాన్ని చూచి వచ్చి, హెూటంగా సామర్థ్యాన్ని మెచ్చు కున్నారు. మహీలా తండ్రి తన కూతుర్ని అతడి కిచ్చి పెళ్ళిచేయటానికి ఒప్పుకున్నాడు. కాని, హెూటంగా నిజాన్ని చెప్పాడు.

అప్పుడు మహీలా తండ్రికి నిజం తెలిసి, హెూటంగా నిజాయితీని మెచ్చుకుని అతడికి తన కూతుర్నిచ్చి పెళ్ళి చేశాడు.

"అసలు నువ్వు నిజమెందుకు బయట పెట్టావు? మా నాన్న నీ నిజాయితీని మెచ్చు కోకపోతే మన పెళ్ళి జరిగి ఉండేదా?" అని అడిగింది మహీలా హెూటంగాని.

హెూటంగా నవ్వి, "నేను స్వతహాగా సోమరిని. నిన్ను పెళ్ళి చేసుకొనటం నా కిష్టమే కాని, అందుకు నా సోమరితనాన్ని వదిలి పెట్టలేను. నీ మీది ప్రేమతో కొండ సొరంగంలోని బండ రాళ్ళనన్నింటినీ తొలగించానని ఒప్పుకుంటే మన పెళ్ళయ్యాక, ఇలాంటి పనులు చాలా చేయవలసి వస్తుంది. అప్పుడు నీ ప్రేమికులు నాకు సహాయపడరు గదా!" అన్నాడు.

మహీలా భర్త ముందు చూపుకు మెచ్చుకోవాలో, సోమరితనానికి నొచ్చుకోవాలో తెలియక అయోమయంలో పడి పోతూంటే, హెూటంగా మాత్రం, "నిన్ను ప్రేమించిన యువకులు ఆ ప్రేమతో కొండ సొరంగాన్ని సానుకూల మార్గం చేశారు. నా మీద ప్రేమతో నువ్వు నా సోమరితనాన్ని భరించక తప్పదు," అంటే ఆమె నవ్వి తల వూపింది.



# విమర్శలో పొగడ్త

విదర్భ దేశాన్ని చంద్రకాంతుడనే రాజు పరిపాలించే వాడు. ఒక రోజు అతడి దగ్గరకు విలోచనుడనే కవి వచ్చి, చంద్రకాంతుడు గొప్పతనాన్ని చాటుతూ పద్యాలు ఆశువుగా చదివి వినిపించాడు. చంద్రకాంతుడు అతణ్ణి మెచ్చుకొని సత్కరించి పంపాడు.

ఇది చూచిన చంద్రకాంతుడి ఆస్థానకవి ధవళుడు, "మహారాజా, ఇప్పుడు తమరు సత్కరించిన కవి మీరు మీ తండ్రి ఇంద్రనీలుణ్ణి మించ గలరనే అన్నాడు. కాని, మించి పోయారని మాత్రం అనలేదు. అంతే కాదు, రాజ్యంలోని అవినీతిని గురించి ప్రస్తావిస్తూ, దాన్ని కాలరాచ కలిగిన సమర్థులు తమ రొక్కరేనట! రాజ్యంలో ఎంతో అవినీతి వున్నదని చెప్పటానికి చేసిన ప్రయత్నం తప్ప మరొకటి కాదిది. పైగా, తమ రాజ్యంలో లలిత కళలు వర్ధిల్లే రోజు దూరంగా లేదనటంలో అతడి వుద్దేశ్యం అటువంటి కళలకి తమ పోషణలో యిప్పుడు ఆదరణ లభించటం లేదని చెప్పటమే కదా! అందుచేత, ఏ విధంగా చూచినా అతడి కవిత్వం మిమ్మల్ని కించ పరిచేదిగా వున్నది," అన్నాడు.

చంద్రకాంతుడు మందహాసం చేస్తూ, "నిజంగానే మీరు అన్నట్లు ఆ కవి చెప్పిన కవిత్వంలో నా గురించి పూర్తి విమర్శ వున్నది. కాని, విమర్శలో ముక్కుకు సూటిగా గుండ బద్దలు కొట్టినట్లు వుంటే ఎవరు హర్షించలేరన్న యింగిత జ్ఞానం వుండటం వల్ల, అతడు తన చాకచక్యంతో విమర్శలోనే నిర్మాణాత్మకమైన పొగడ్తలని చొప్పించి, పద్యాలు అల్లాడు. సూక్ష్మంగా పరిశీలించి చూస్తే, నేను శక్తి సామర్థ్యాలున్నప్పటికీ నా తండ్రి ఇంద్రనీలుణ్ణి గొప్పతనంలో అధిగమించ లేక పోతున్నానన్న తపన వున్నది ఆ కవికి. అలాగే అధికార్లకి వదిలి వెయ్యకుండా, నేనే పూనుకున్నట్లయితే, రాజ్యంలో అసలు అవినీతి అన్న దానికే తావుండబోదని అతడి అభిప్రాయం కావచ్చు. లలితకళల పట్ల నా కున్న అభిరుచిని పట్టి చూస్తే, వాటికి లభించాల్సిన ప్రోత్సాహం ఇంకా ఎంతో వున్నదన్న సూచన కూడా అతడి మాటల్లో నాకు కనపడుతున్నది. మానవ స్వభావం ఎటు వంటిదో తెలుసుకున్నప్పుడు తాము చెప్పాలనుకున్నది నిర్మాణాత్మకమైన విమర్శ ద్వారా కాక, నిర్మాణాత్మకమైన పొగడ్త ద్వారా సాధించా లనుకోవటం విజ్ఞుల లక్షణం. ఆ కవిని సత్కరించటంలో నేను చేసింది పొరపాటు అని యింకా మీరు భావిస్తున్నారా?" అని ఎదురు ప్రశ్న వేశాడు.

ధవళుడు సిగ్గుపడి, ఆ పైన మహారాజు రసజ్ఞతని వేయివిధాలుగా అభినందించాడు.

—జె. రత్న






(గత సంచిక తరువాయి)

మధ్యాహ్న సమయం. రాజభవనం తూర్పు ద్వారం దగ్గర చల్లగా ఉంది. పనస, మామిడి, జీడి మామిడి మొదలైన పండ్ల చెట్లు గుబురుగా ఉండి చల్లని నీడ నిస్తున్నాయి.

ఆకాశరాజు భార్య ధరణీదేవి రెండవ అంతస్తు లోనికి వెళ్ళి, గబగబ కిటికీ దగ్గరికి వచ్చి వీథిలోకి చూచింది.

వీథిలో ఒక పుళింద స్త్రీ తన పసిబిడ్డను జోలెలో పెట్టుకొని, "సోదె చెపుతానమ్మా, సోదె చెపుతాను," అంటూ కేకలు వేస్తూ వెళుతున్నది.

ఇంకా ఆ ఎరుకుల పడతి పెద్దగా ఇలా అంటున్నది.

"జరేగింది చెపుతాను, జరగబోయేడి చెపుతాను. జరుగుతున్నది చెపుతాను. ఉన్నది ఉన్నట్లుగా చెపుతాను."

ఆ మాటలు విని. ధరణీదేవి ఆ సోదెకత్తెను వెంటబెట్టుకొని రమ్మని సేవకుణ్ణి పంపించింది. తన కూతురు పద్మావతి జబ్బు ఏమిటో ధరణీదేవికి బోధ పడలేదు. అది తెలుసుకోవాలని ఆమె వుద్దేశ్యం.

'ఎరుకలవాళ్ళు ఏ దేవత అనుగ్రహమో సంపాదించి, సమస్తమూ తెలుసుకుంటారు, అనే నమ్మకం ఆమెకు ఉంది.

సేవకుడి వెంట సోదెకత్తె ఒయ్యారంగా బయలుదేరింది. తూర్పు వాకిలి దగ్గర పూల మొక్కలను, ఫల వృక్షాలను, జల యంత్రాలను చూచి ఆశ్చర్యపడుతూ, మెల్లగా లోనికి ప్రవేశించింది ఆమె.

ధరణీదేవి లోపలి నుంచి వస్తూనే బంగారు చేట నిండా బియ్యం పోసుకొని వచ్చి, "నీ పేరేమిటే సోదెమ్మా?" అని అడిగింది.

"నా పేరు కొరవంజి. ఎరుకులదాన్ని. అంతా ఎరిగిన దాన్ని, అడుగమ్మా అడుగు.



నీ వేమి అడుగుతావో అడుగు, అంతా చెపుతాను," అని చల్లని పాలరాతి నేల మీద చతికిలపడి కూర్చున్నది కొరవంజి.

చేటలోని బియ్యం చూచి, "అవి మూడు కుప్పలుగా చేయి తల్లీ!" అన్నది కొరవంజి.

రాణి అలాగే చేసింది.

"ఈ మూడు కుప్పలలో ఒక దాని మీద మనసుంచు. అంటే ఒక దాన్ని తలచుకో తల్లీ!" అన్నది కొరవంజి.

"నీవు తలచుకొన్నది ఆ మధ్య కుప్పను. నిజమేనా?" అని అడిగింది కొరవంజి కూడా.

కొరవంజి ప్రజ్ఞకు రాణి ఆశ్చర్యపడి, "అవును," అన్నది.

కొరవంజి తన చేతిలోని మంత్రదండం అడిస్తూ, "ఇక నేను చెప్పేవన్నీ నిజాలే అనుకో," అన్నది.

"నా మనసులో ఒక ప్రశ్న ఉన్నది. దానికి నీవు సమాధానం చెప్పాలి," అంది రాణి ధరణీదేవి.

"చెపుతాను తల్లీ! నేను జరిగింది, జరిగేది-జరుగనున్నది—ఉన్నది ఉన్నట్లుగా చెపుతాను. నా బిడ్డకు కొంచెం అన్నం పెట్టించు తల్లీ!" అని అడిగింది కొరవంజి జాలిగా.

రాణి అనుమతితో పరిచారిక ఒకతె లోనికి వెళ్ళి బంగారు పాత్రలో పాయసాన్నం తెచ్చి కొరవంజికి ఇచ్చింది.

"నీ బిడ్డ ఆకలి తీరుతుంది. నీకు ఓ మంచి బహుమానం కూడా ఇస్తాను. వెంటనే నా ప్రశ్నను సమాధానం చెప్పు," అంటూ తొందర పెట్టసాగింది రాణి.

ఆ కొరవంజి తన బిడ్డ తల నిమురుతూ, నింపాదిగా క్షీరాన్నం తినిపించిన తర్వాత, మంత్రదండం చేతబట్టి రాగయుక్తంగా ఇలా చెప్పటం మొదలు పెట్టింది.

"ఓ తల్లీ! ఓ తల్లీ! నీవు నీ బిడ్డ విషయం అడుగుతున్నావు. నీ బిడ్డకు ఏ జబ్బూ లేదు. ఆ పడుచు ఒక పడుచువాణ్ణి చూచింది. అతణ్ణి వలచింది. వలచినవాణ్ణి చేరలేక పోవటం వల్ల, ఆమెకు వలకాక ఎక్కువ అయింది. అది మదనజ్వరమే తల్లీ! మరేమీ కాదు. ఆ వలచినవాడు మానవమాత్రుడు



కాదు. అతడు వైకుంఠం నుంచి భూలోకానికి వచ్చి, వేంకటాద్రి మీద స్వామి పుష్కరిణి దగ్గర విహరిస్తున్నాడమ్మా! అతడు శ్రీనివాసుడు తల్లీ! అతడు దేవతలకు దేవుడమ్మా!

"ఇంకా చెపుతాను, విను తల్లీ! నాకు మంచి కానుక లివ్వాలి నీవు. ఆ శ్రీనివాసుడు ఒకనాడు గుర్ర మెక్కి వేటకు వచ్చాడమ్మా. పూలతోటలో నీ కూతురిని చూచాడు తల్లీ! మహాలక్ష్మి లాగా ఉన్న నీ కూతురిని ఆ శ్రీనివాసుడు మోహించాడు తల్లీ! ఆ పడుచు వాడు కూడా ఇప్పుడు మదనజ్వరముతో బాధ పడుతున్నాడు. ఇదిగో, ఈ దిక్కున...!"

అలా అంటూనే కొరవంజి తన చేతిలోని కర్రను తన వైపుకు—వేంకటాద్రి వైపుకు—చూపించింది.

"మరింకా జరగబోయేది చెపుతాను, విను తల్లీ! నీ కుమార్తె మీద మక్కువతో ఆ శ్రీనివాసుడు నీ వద్దకు ఒకామెను రాయబారం పంపిస్తాడు. నీ కూతురు మహాలక్ష్మికి సవతి అవుతుంది. కలకాలం శ్రీనివాసుణ్ణే కూడి సుఖపడుతుంది, తల్లీ! నా మాటలు సత్యం సత్యం. ఇప్పుడే నీకు నా మాటలు అనుభవానికి వస్తాయి తల్లీ!"

అలా ముగించి, "నా బిడ్డకు ఇంక కొంచెం అన్నం పెట్టించు తల్లీ," అన్నది కొరవంజి వినయంగా.

ధరణీదేవి కొరవంజి బిడ్డకు మళ్ళీ పాయసాన్నం పెట్టించి, బుట్ట నిండా మధుర పదార్థాలు పెట్టించి, బంగారం కాసు కానుక ఇచ్చి, అంతఃపురం లోనికి చేరుకొన్నది. పట్టె మంచం మీద పరున్న పద్మావతి దగ్గరకు వచ్చి, పరిచారికలను అవతలికి పంపించి ఇలా అడిగింది ఆమె.

"పద్మా, నీ కోరిక ఏమిటో చెప్పమ్మా. దాపరికం లేకుండా చెప్పు. నీవు మనసులో దేని కోసమో బాధపడుతున్నట్లుగా తోస్తున్నది. నీవు ఏది కావాలన్నా తెప్పించి ఇస్తాను."

"అమ్మా, నాకు ఏమీ జబ్బు లేదు. నాకు ఒక కోరిక ఉంది. అది నా మనస్సును, శరీరాన్ని నింపివేయటం వల్ల నేను మంచాన పడవలసి వచ్చింది. నీల మేఘశ్యాముడు,

వాసుదేవుడు, పురుషోత్తముడు నా మనసులో నిండి ఉన్నాడు. ఆ పురుషోత్తముణ్ణి చేసుకోవాలని నా మనస్సు, శరీరం ఆరాటపడుతున్నాయి. ఆయనకు సేవ చేసి ధన్యురాలను కావాలని ఉన్నది. నీవు చేయగలిగితే నన్ను ఆయన సన్నిధికి చేర్పించు. అందుకు ఉపాయం ఆలోచించు.'' అన్నది పద్మావతి దీనంగా.

పద్మావతి కోరిక విని ఖిన్నురాలయింది ధరణీదేవి.

'నా కూతురి కోరిక అందరాని పండు ఆమె మనసులో ఉన్నవాడు శ్రీ మహావిష్ణువు. ఆయన మహాయోగులకే దుర్లభుడు. ఆమె కోరిక నెరవేరేది కాదు. ఈ పిల్ల జీవితాంతం ఇలాగే మంచాన పడి ఉంటుందేమో!' అని అనుకుంటూ కన్నీళ్ళు తుడుచుకొంటూ ఇవతలికి వచ్చింది ధరణీదేవి.

ఆ సమయంలోనే, అగస్త్యేశ్వరాలయంలో అభిషేకం జరిపించి వచ్చిన బ్రాహ్మణులు ధరణీదేవికి తీర్థప్రసాదాలు పెట్టారు. రాజభవనంలో వెంటనే వారికి భోజనం ఏర్పాట్లు జరిగాయి.

నూతన వస్త్రాలు, పండ్లు సమర్పించి వారి దీవెనలు పొందింది ధరణీదేవి.

అంతలోనే, తూర్పు ద్వారం నుంచి చెలికత్తెలు, వారి మధ్య వకుళమాలిక రావటం చూచింది ధరణీదేవి. బ్రాహ్మణులు సంతృప్తిపడి వెళ్ళిన తర్వాత, ఆ స్త్రీలను తన అంతఃపురం లోనికి పిలిచింది ఆమె.

వాళ్ళందరూ వచ్చి కూర్చున్నారు. వాళ్ళ మధ్య వున్న వకుళమాలిక విలక్షణ రూపం చూచి ఆశ్చర్యపడింది రాణి. అభిషేకోత్సవము ఎలా జరిగిందో తెలుసుకోవాలన్న కుతూహలం కన్నా, ఆ స్ఫురద్రూపిణి ఎవరో తెలుసుకోవాలన్న కోరిక ఆమెకు అధికమయింది. —(ఇంకా ఉంది)






# ప్రత్యుపకారం

బొగ్దాద్ నగరంలో ఒకానొకప్పుడు హుస్సేన్ అనే దయుగల భాగ్యవంతుడు వుండే వాడు. ఉన్నంతలో దానధర్మాలు చేయటమే కాక తనకు ఉపకారం చేసిన వారందరికీ తప్పక ప్రత్యుపకారం కూడా చేసే వాడు.

ఒకసారి హుస్సేన్ వ్యాపారం పని మీద పొరుగూరు వెళ్ళి తిరిగి వస్తూండగా, దారిలో దొంగలు అతణ్ణి కొట్టి, ఉన్నది ఊడ్చుకుని పోయారు. ఆ తర్వాత ఆ దారినే పోతూన్న హసన్, రఫీ అనే ఇద్దరు యువకులు అతణ్ణి చూచి, సపర్యలు చేసి స్పృహ తెప్పించి హుస్సేన్‌ను ఇంటి దాకా చేర్చారు.

"మీరు నా ప్రాణాలు కాపాడారు. అల్లాయే మిమ్మల్ని పంపి ఉంటాడు. మిమ్మల్ని సత్కరించటం నా బాధ్యత. నా దుకాణం లోని మీకు నచ్చిన వస్తువును తీసుకుని నచ్చిన ధర ఇవ్వండి." అన్నాడు హుస్సేన్.

రఫీ ఒక వెండి నాణెం యిచ్చాడు. హసన్ మాత్రం తన ప్రియురాలికి వెండి అందెలు తీసుకుని దాని ధర అడిగాడు.

"కొనాలంటే రెండు వందల వెండి నాణేలు వుంటుంది. నీకైతే ఒక్క వెండి నాణేనికే యివ్వగలను." అన్నాడు హుస్సేన్.

"నా వద్ద నూటయాభై వెండి నాణేలు వున్నవి. కాని, దారి ఖర్చుల కింకా యాభై నాణేల అవసరం వుంటుంది. కాబట్టి నూరు ఇస్తాను," అంటూ వాటిని ఇచ్చాడు హసన్.

కొంత దూరం పోయాక రఫీ హసన్‌తో. "ప్రాణాలు రక్షించినందుకు మనకు బహుమతి నివ్వొచ్చుగా! నువ్వు తెలివి తక్కువగా నూరు నాణేలు ఇచ్చావు. ఒకటే యివ్వాల్సింది. నాకైతే ఆ ఒక్క నాణెం తీసుకుంటే మురి సలాడి కేమి వస్తుందో!" అన్నాడు.

హసన్ నవ్వి ఊరుకున్నాడు. అతడికి తాను మానవధర్మంగా చేసిన సహాయానికి ప్రతిఫలం పొందటం ఇష్టం లేదు.

రాజా

అలా కొన్నేళ్ళు గడిచాక, ఆ యువకులు ఇద్దరూ తమ తమ భార్యలతో కలసి, మళ్ళీ హుస్సేన్ ఉండె నగరం వెళ్ళారు. భార్యలు పట్టుబట్టగా వారొకసారి హుస్సేన్ దుకాణానికి వెళ్ళారు. అప్పుడు హుస్సేన్ రఫీ భార్యకో వెండి ఉంగరాన్నీ, హసన్ భార్యకో స్వర్ణ హారాన్నీ బహుమతిగా యిచ్చాడు.

రఫీ భార్య ముఖం వివర్ణమై పోయింది.

"ఈ విధంగా బహుమతు లివ్వటం నన్ను అవమానించటానికే కదా!" అన్నాడు రఫీ.

హుస్సేన్ నవ్వి, "ఇందులో అవమానం ఏముంది? నేను నాదేమీ మీకు ఇవ్వలేదు. మీదే మీకు ఇచ్చాను. నాకు ఉపకారం చేసిన వాళ్ళకు నేను ప్రత్యుపకారం చేసే పద్ధతిదే. నేను మీకు బహుమతిగా ఇచ్చిన వస్తువులకు ధర కట్టాను. మీరు ఇచ్చిన డబ్బును మీ తరఫున పెట్టుబడిగా నా వ్యాపారంలో వినియోగించాను. పది సంవత్సరాల లోగా మీరు రాకపోతే, మీ యింటికే డబ్బు పంపించి ఉండే వాణ్ణి. ఈలోగానే మనం కలుసుకున్నాం. కాబట్టి, ఇప్పుడే మీ వాటా మీకు ఇచ్చేశాను," అన్నాడు.

రఫీ తెల్లబోయాడు. అప్పుడు తాను అత్యాశకు పోయి కొన్ని వందల నాణేల విలువ చేసే లోటాకు ఒక్క నాణెం యిచ్చాడు. హసన్‌లాగే తానూ వంద నాణేలు ఇచ్చి ఉంటే, ఇప్పుడు తనకూ పదివేలు విలువ చేసే స్వర్ణహారం వచ్చేది. తన దగ్గర వుంటే ఇంత తక్కువ కాలంలో ఆ నాణేలు విలువ ఇంతగా పెరగదు కూడా.

ఆశాపరుడికి ఒక విధంగానూ, నిస్వార్థపరుడికి మరో విధంగానూ ప్రత్యుపకారం చేసే హుస్సేన్ పద్ధతిని రఫీ కూడా అప్పుడు ఎంతో మెచ్చుకున్నాడు. ఆ తర్వాత నుంచీ అతడు కూడా హసన్‌లాగే ఫలాపేక్ష లేకుండా ఇతరులకు సహాయపడటం ప్రారంభించాడు.







# శిక్ష

రామాయపురం అనే గ్రామంలో అంటరానితనం పాటించబడుతూ వుండేది. అంటరాని వాళ్ళందరూ ఊరికి కాస్త దూరంగా ఉండే వారు. ఊళ్ళో ఉన్నవాళ్ళ కోసం అనేక రకాలుగా కాయకష్టం చేసే వారు. కాని ఊళ్ళో మాత్రం వాళ్ళు ఎవరినీ తాక కూడదు. అంటరాని వారి కోసం వారు వుండే చోట ఓ చెరువు వుండేది.

ఇలా ఉండగా, ఒక సంవత్సరం బొత్తిగా వానలు పడక అంటరాని వాళ్ళ చెరువు నిండలేదు. వాళ్ళకు నీళ్ళ కరువు వచ్చింది. అయినప్పటికీ వాళ్ళకి ఊళ్ళో వున్న బావి నీళ్ళు తాకే యోగ్యత లేదు. అందువల్ల, కొందరు అంటరాని ఆడవాళ్ళు రోజూ బోలెడు దూరం నడిచి, ఎక్కడో దూరాన ఉన్న నది నుంచి నీళ్ళు తెచ్చుకునే వారు.

రాజు మారువేషంలో దేశ సంచారం చేస్తూ, రామాయపురం వచ్చి ఇదంతా చూచి, గుండె నీరైపోగా గ్రామస్థుల వద్దకు వెళ్ళి, "ఇది చాలా అన్యాయం. సాటి మనుషులు నీళ్ళు లేక ఇబ్బంది పడుతూ వుంటే ఊళ్ళో బావులుండీ మీరు వాళ్ళకు నీళ్ళు ఇవ్వరేం?" అని అడిగాడు.

"వాళ్ళు అంటరాని వాళ్ళు. మా బావుల్లో నీటిని తాకే అర్హత వాళ్ళకు లేదు ఇది మా నిర్ణయం కాదు. భగవంతుడి నిర్ణయం," అన్నారు గ్రామస్థులు.

"భగవంతుడి విషయం అటు వుంచండి. ఈ దేశపు రాజుగా నేను చెపుతున్నాను. మీరు వాళ్ళను బావిలో నీరు తీసుకో నివ్వాల్సిందే!" అంటూ రాజు మారువేషం తొలగించగానే గ్రామస్థు లాయన కాళ్ళమీద పడి, "ప్రభూ, తమరు ఎవరో తెలియక నిరసనగా మాట్లాడాము. మన్నించండి. అయితే, అంటరాని వాళ్ళను మా బావులను తాకనిచ్చి నీటిని అపవిత్రం చేసుకోలేము. అదే మీరు

శ్రీరామకుమార్

రాజశాసనము అనే పక్షంలో, గ్రామస్థులు అందరం ప్రాయోపవేశం చేస్తాం," అన్నారు.

"అంటరానితనాన్ని నమ్ముతూండే మీ వంటి మూర్ఖులు ప్రాయోపవేశం చేసి ప్రాణాలు తీసుకున్నా దేశానికి వాటిల్లే నష్టము ఏమీ ఉండదు. అయినప్పటికీ ఈ దేశపు రాజుగా నేనందరి క్షేమాన్నీ కోరిన వాణ్ణి కాబట్టి, ఉభయతారకంగా ఉండే ఉపాయం చెపుతాను. అంటరాని వాళ్ళను బావుల్ని తాకనివ్వకండి. మీరే వాళ్ళకు నీళ్ళు తోడి ఇవ్వండి. ఆ విధంగా వాళ్ళకు నీళ్ళ కరువూ తీరుతుంది. మీ సదాచారమూ నిలబడుతుంది," అన్నాడు రాజు.

గ్రామస్థు లందరూ వేరే దారి లేక దీనికి అంగీకరించారు.

రాజు తిరిగి రాజధాని చేరుకున్నాక, దాన్నే రాజశాసనం చేశాడు. ఈ శాసనం ఆ దేశపు మంత్రికి నచ్చలేదు.

"ప్రభూ, మీ శాసనము అంటరానితనాన్ని ప్రోత్సహిస్తున్నది. అంటరానితనం నేరం కదా!" అన్నాడు.

"అవును. అంటరానితనం నేరమే! కాని, అది నేరమని అర్థం చేసుకోలేని మూర్ఖులు చాలామంది వున్నారు. వాళ్ళ మనసుల్లో మార్పు రావాలి కాని, బలవంతంగా శాసనాలను మూర్ఖులపై రుద్ద లేము. అగ్రకులాల వారు తామెంతో గొప్పవారమని భావిస్తున్నారు. అటువంటి వారిచేత మన శాసనం అంటరాని వారికి సేవ చేయిస్తున్నది. నీళ్ళు తోడివ్వటం సేవాధర్మమే కదా! అందువల్ల, ఈ శాసనం అంటరానితనం పాటించే వారికి శిక్ష అవుతుంది. ఆ శిక్ష నుంచి వారు తప్పించుకోవాలంటే, తాము పాటించే సదాచారం మానాలి," అన్నాడు రాజు.

మంత్రికి విషయం అర్థం కాగానే రాజు తెలివిని మెచ్చుకున్నాడు.




వసంతసేన
కోసలదేశపు రాకుమారి పేరు వసంతసేన. ఆమెకు చిత్రలేఖనం వచ్చుగాని, ఆమె గీచిన బొమ్మల్లో ఏమాత్రం సౌందర్యం కనిపించేది కాదు. రాకుమారి గీచిన బొమ్మలు కనుక. ఆ బొమ్మలు ప్రజల్లోకి వెళ్ళేవి. ఎవరూ మన స్ఫూర్తిగా వాటిని మెచ్చుకొనే వారు కాదు. రాకుమారికి ఆ విషయం తెలుస్తూనే వుండేది.
ఇలా వుండగా ఒకనాడు ఓ చిలుక ఎక్కడి నుండో ఎగిరి వచ్చి. "నేను చెపుతాను. నీవు బొమ్మలు గీయి. అవి ఎంత బాగుంటాయో ఆ తరవాత చూచుకో." అంది.
నిజంగానే చిలుక ఏ బొమ్మను ఎలా
కరాళకథలు




గీయాలో వివరించి, చెపుతూ వుండేది. చిలుకకు యిన్ని మాటలు రావటం చూచి రాకుమారికి విస్తుపోయేది.

"నాదేముంది? అంతా మా గురువుగారి ప్రసాదం. ఈ చిత్రలేఖనం విద్య ఆయనిది. నేను మాట్లాడే మాటలు ఆయనవి. నాలాంటి పక్షి చేత యిన్ని మాట్లాడించటం ఆయన గొప్ప," అనేది ఆ చిలుక.

"ఆయన ఎవరు? ఎక్కడ వుంటారు?" అని అడిగింది వసంతసేన ఆత్రంగా.

"చెప్పవలసిన రోజున తప్పక చెపుతాను. ముందు నీవు బొమ్మలు గీయి. అవి నలుగురిలో 'అమోఘం' అనిపించుకోనివ్," అంది చిలుక.

రాకుమారి, ఎందరివో రాకుమారుల బొమ్మలు గీచింది. అవి అన్నీ చిలుక చెప్పగా, ఊహించి గీచిన బొమ్మలు. రాకుమారి ఆ బొమ్మలను పొరుగుదేశపు రాకుమార్తెలకు పంపుతూ వుండేది. బొమ్మల్లో యువకులను చూచి, ప్రతి రాకుమార్తె పెళ్ళాడితే అలాంటి యువకుడినే పెళ్ళాడాలని అనుకునేది.

వసంతసేనకు చిత్రలేఖనంలో ఎనలేని పేరు ప్రఖ్యాతులొచ్చాయి. ఆమె మాత్రం బొమ్మల్లో రాకుమారుల సౌందర్యానికి మురిసిపోక, చిలుక గురువు ఎవరో, అతడే తన ఆరాధ్య దైవంగా భావిస్తూ వచ్చింది.

రాకుమారి తన గురువును ప్రేమిస్తూందని నమ్మకం కలిగాక, అతడెవరో విప్పి చెప్పింది. అతడు గుణశేఖరుడనే ఓ సామాన్య పౌరుడు. నిజానికి అతడికి చిత్రలేఖనం రాదు. ప్రబంధ సౌందర్యవంతుల వర్ణనలు గుర్తు వుంచుకుని, వాటిని చిలుకకు నేర్పుతూ వచ్చాడు. రాకుమారికి చిత్రలేఖనం వచ్చుగాని, ఊహ శక్తి లేని కారణంగా, ఆమె రాణించ లేక పోయింది. చిలుక అందించే ఊహలతో కావ్య నాయకుల బొమ్మలు అనేకం గీయగలిగింది. గుణశేఖరుడికి చిత్రలేఖనం రాదని తెలిసి, రాకుమారి నిరుత్సాహపడినా, అతడి నుండి మనస్సు మరల్చుకోలేదు.

ఎందరో అందగాళ్ళను పటాలలో చూపించి, ఓ సామాన్య పౌరుణ్ణి పెళ్ళాడతానంటే రాజు

ఒప్పుకోడని వసంతసేనకు తెలుసు అందుకని మరో కంటివాడికి తెలియకుండా, గుణశేఖరుడికి కోటలో గంటలు కొట్టేవాడి ఉద్యోగం యిప్పించింది. అతడు శ్రద్ధగా పని చేస్తున్నట్టు ఒకటి రెండు సందర్భాలను సృష్టించి, తండ్రి దృష్టిలో పడేలా చేసింది గుణశేఖరుడు గంటలు కొట్టే పదవి నుండి ఖజానాలో కాపలాదారుడి పదవిలోకి వచ్చాడు. యువరాణి చాటుమాటుగా అందించిన చేయూతతో కొన్నాళ్ళకు రాజు అంతరంగిక సలహాదారులలో ఒకడయ్యాడు.

ఇలా వుండగా, రాజు ఓసారి తన కుమార్తె యొక్క చిత్రకళా కౌసల్యత చూడాలనే ఉబలాటంతో, ఆమె లేని సమయంలో ఆమె కళామందిరానికి వెళ్ళాడు.

అక్కడ అనేకమంది అందగాళ్ళ బొమ్మలు గీయబడి వున్నాయి. ఆ బొమ్మలు ఎన్ని వున్నాయో అంత కన్నా ఎక్కువగా గుణశేఖరుడి బొమ్మలు వివిధ భంగిమల్లో గీయబడి వున్నాయి. రాజు ఆశ్చర్యపోయాడు. ఒకవేళ తన కూతురు అతణ్ణి ప్రేమిస్తూందేమో నన్న అనుమానం పొందాడు.

నేరుగా వసంతసేనను పిలిచి గుణశేఖరుడి బొమ్మలు సంగతి అడిగాడు. వసంతసేన మొదట కంగారు పడ్డా, తమాయించుకుని ఓ సామాన్య అందగాడి బొమ్మలకు, ఊహా చిత్రాలలో కనిపించే అందగాళ్ళ బొమ్మలకు



వ్యత్యాసం తెలియజెప్పటం కోసం అతడి బొమ్మలు గీశానని చెప్పింది.

రాజు ఆమె మాటలకు నమ్మినట్టు కనిపించినా, ఒక పరాయి మగాడి బొమ్మలు ఏ పరిచయమూ లేకపోతే, అంత స్పష్టంగా గీయటం కష్టమని భావించాడు. వసంతసేనకు తెలియకుండా గూఢచారులను నియమించాడు. చివరకు గుణశేఖరుడూ, రాకుమార్తె చాటుగా కలుసుకుంటున్నట్టూ, రాకుమార్తె అతణ్ణి గాఢంగా ప్రేమిస్తున్నట్టూ గూఢచారులు కనిపెట్టి, రాజుకు తెలియజేశారు. వసంతసేన తన ఊహా చిత్రాలలో గల అందగాళ్ళల్లాంటి వాడిని ఎవరినైనా ప్రేమించి వుంటే ఆశ్చర్యపడే వాడు కాదు




రాజు. లేదా, ఆ గుణశేఖరుడు ఏ వీరుడో, ఏ రాకుమారుడో అయినా రాజుకి ఆశ్చర్యం కలిగేది కాదు.

ఒక సామాన్యుడై వుండి గుణశేఖరుడు రాకుమార్తె మనస్సుని ఎలా చూరగొన్నాడో రాజుకి ఎంత యోచించినా అర్థం కాలేదు. రాజు గుణశేఖరుడి బొమ్మలన్నీ తెప్పించి వివిధ దేశపు రాకుమార్తెలకు పంపాడు. వసంతసేనే వాటిని పంపినట్టు చెప్పించాడు.

ఎందరో అందగాళ్ళను సృష్టించిన వసంతసేన, అంత అందవిహీనమైన బొమ్మను గీచి పంపినందుకు ఆశ్చర్యపడుతూ, "వాడు అందగాడా? ఇది నీవు గీయవలసిన బొమ్మా?" అంటూ వసంతసేనకు కబుర్లు అందాయి.

ఇలా వుండగా వసంతసేన గీచిన బొమ్మల్లో అచ్చంగా ఓ బొమ్మను పోలిన రాకుమారుడు ఆ రాజ్యానికి రావటం జరిగింది. అతడు రాకుమారిని కలుసుకుని మాట్లాడేందుకు అనుమతి పొంది. ఆమెను కలుసుకున్నాడు. చిలుక చెప్పినవన్నీ ఊహలే. కనుక, ఊహల్లో మనుషులు నిజంగా వుండరని వసంతసేన భావిస్తూ వచ్చింది. అందుకే తన చిత్రపటాల్లో అందగాళ్ళను చూచి, ఆమె మైమరచి పోలేదు. కాని, నిజంగా అలాంటి అందగాడే తారసపడే సరికి, ఆమె నిర్ఘాంత పోయింది.

ఏమైనా అతడు పరాయివాడు కనుక, రాకుమారి గంభీరతను తెచ్చుకుని, "నన్ను దేనికి కలుసుకోవటం?" అని అడిగింది.

"ఇది వరకు మనం ఎప్పుడూ కలుసుకోలేదు. నన్ను చూడకుండా నా బొమ్మ గీయగలగటం నాకాశ్చర్యంగా వుంది. నా పటాన్ని మీరు అన్ని దేశాల రాకుమార్తెలకూ పంపారు. ఇప్పుడు వాళ్ళంతా నా గురించి తెలుసుకుని, నన్ను వివాహమాడేందుకు తొందర పడుతున్నారు. నాకు మాత్రం నన్ను ఊహల్లో ఊహించిన యువతినే పెళ్ళాడాలని వుంది. అటు తిరిగి నిలబడటంగాక, ఒక్కసారి నా వంక చూడండి. మీ ఊహాచిత్రానికి నేను కొంచెం భిన్నంగా వున్నా నన్ను తిరస్కరించవచ్చు." అన్నాడు.

వసంతసేన అతడిని తిరిగి చూచేందుకు



సాహసించలేక పోయింది. నిజానికి తాను గీచిన అన్ని చిత్రాలలోకి, అతడి బొమ్మే తనని ఎక్కువ ఆకర్షించింది. అంతటి అందగాడు వుంటాడా అని ఎన్ని సార్లో అనుకుని, అంతటి అందాన్ని ఊహించి చెప్పగలిగిన చిలుక గురువుని ప్రేమించింది. ఇప్పుడు వాస్తవంగా ఆ అందగాడే వచ్చి, 'నన్ను చూడు' అని పిలుస్తూంటే, ఆమెకి మతి పోయింది.

గుణశేఖరుడు చిలుక్కి చెప్పిన మాటలన్నీ గ్రంథాలలోని వనా డు. ఒక ముక్క తప్పకుండా, గ్రంథాలలో మనిషి ఎలా వస్తాడు?"

రాకుమారికి ఏమి చేయటానికి తోచక, "నేను మిమ్మల్ని చూడవలసిందేమీ లేదు మా తండ్రి అంతరంగిక సలహాదారుల్లో గుణశేఖరుడనే ఆయన వున్నారు. ఆయన్ని వెళ్ళి కలవండి," అన్నది.

"గుణశేఖరుడంటే, నా రాజ్యంలో నా దగ్గర సేవకుడుగా పనిచేసిన వాడొకడు యీ రాజ్యానికి వచ్చాడు. వాడు కాదు గదా!" అన్నాడు రాకుమారుడు ఆశ్చర్యంగా.

ఆనవాళ్ళు అన్నీ చెప్పగా ఆ గుణశేఖరుడే యీ గుణశేఖరుడని అర్థము అయింది. రాకుమారికి పిడుగు పడినట్టయింది. ఆమె మరి కొంత సేపు పటంలో రాకుమారుడితో మాట్లాడేసరికి ఎన్నో విషయాలు అర్థము అయ్యాయి. ఈ రాకుమారుడే వసంతసేనను ఓసారి అడవికి వేటకు వచ్చినప్పుడు చూశాడట.

ఆమెను ప్రేమించాడు. ఆమె చిత్రలేఖనంపై మక్కువ వుండి, రాణించలేక తికమక పడుతున్నట్టు విన్నాడు. తన దగ్గర సేవకుడిగా పనిజేస్తున్న గుణశేఖరుడనే వాడి దగ్గర ఓ మాట్లాడే చిలుక వుంది. దానికి తన కన్నా తక్కువ అందాలతో అనేకమంది రాకుమారుల అందచందాలు నూరి పోసి, ఆఖరున తన అందం గురించి నూరి పోయటం జరిగింది. చిలుక యజమానిగా, చిలుకకు మాటలు నేర్పిన వాడుగా ఆ చిలుకతో గుణశేఖరుడు కోసల దేశానికి పంపడ్డాడు.

కాని, వాడు వంచనకు దిగి, తానే రాకుమారి ప్రియుడుగా మారాడు. ఇంత తెలిశాక, రాకుమారి మనసు భగభగ లాడింది.




"నన్ను చూచి మనస్సు పడగానే మీరు మా తండ్రిని కల్సుకుని వుంటే మన వివాహం జరిగేది. అలాగాక, నా బలహీనత ఏమిటో తెలుసుకుని, ఆ బలహీనతపై దెబ్బకొట్టి నన్ను చేజిక్కించుకోవాలనుకున్నారు. ఇప్పుడు మీ సేవకుడే మిమ్మల్ని దెబ్బ కొట్టాడు. ఇప్పుడు అతడు నా ప్రియుడు. మా తండ్రి మా వివాహానికి ఒప్పుకోపోవచ్చు. బలవంతంగా మా తండ్రి మీకు అంటగట్టే పక్షంలో, నేను మీ భార్యను అవుతానేమో తెలియదు. మా తండ్రిని కలుసుకుని ప్రయోజనం వుంటుందేమో చూడండి," అంది వసంత సేన.

ఆమె సలహాపై పొరుగుదేశపు రాకుమారుడు మహారాజుని కలిశాడు. జరిగినది అంతా ఆయనకి వివరించి చెప్పాడు. మహారాజు వెంటనే గుణశేఖరుడిని పిలిపించి, అతడా రాకుమారుడి సేవకుడని రూఢీ చేసుకున్నాడు. ఆరు నెలలు పాటు తమకు అతిథిగా వుండే పక్షంలో, తన నిర్ణయం తెలుపుతానని రాజు పొరుగుదేశపు రాకుమారుణ్ణి అభ్యర్థించాడు.

తాను ప్రేమించిన యువతి వున్న చోట ఆరు నెలలు వుండటానికి, ఆ రాకుమారుడు ఎంతగానో సంతోషించాడు. ఆరు నెలలూ ఆ రాకుమారుడికి సకల వైభోగాలతో మర్యాదలు జరపబడ్డాయి. రాకుమారుడు ఇంకేమీ ఆలోచించ లేదు. ఆరు నెలలూ గడిపాడు.

ఓ రోజున రాజు రాకుమారుడిని తన దగ్గరకు పిలిపించుకున్నాడు. గుణశేఖరుడు కూడా అప్పుడు అక్కడే వున్నాడు.

అతణ్ణి చూచి ఆశ్చర్యపడి, "ఇంకా వీణ్ణి చంపలేదూ?" అని అడిగాడు రాకుమారుడు.

"లేదు. చంపితే, కేవలం మా అమ్మాయిని ప్రేమించాడన్న నెపంతో చంపినట్టవుతుంది. కనుక ఆ చంపే అవకాశం మీకే యిస్తున్నాం," అంటూ ఇద్దరికీ చెరో కత్తి అందించి, "మీలో ఎవరు గెలిస్తే వారు రెండో వారిని చంపెయ వచ్చు," అన్నాడు రాజు.

రాకుమారుడు నవ్వుకునాడు. గుణశేఖరుడిని రాజు పరోక్షంగా ఏ రకంగా చంప దలచిందీ అతడికి అర్థమయింది. ఇద్దరి కత్తులు కలిశాయి. ఇదివరకు కత్తి పట్టటమే

చేతగాని గుణశేఖరుడిని మొదటి వేటుకే రాకుమారుడు నరికివేయగల ననుకున్నాడు. కాని అలా జరగలేదు. గుణశేఖరుడు కత్తి యుద్ధంలో నైపుణ్యం సంపాదించినట్టు కనిపించాడు. ఇద్దరి మధ్య ఘోరమైన యుద్ధం జరిగింది. ఈ ఆరు నెలలూ గుణశేఖరుడు నేర్చుకునేందుకు కత్తి పట్టి వుండటము— దమ్ము పట్టటంలో, కత్తిని చలాకీగా తిప్పటంలో రాకుమారుడికన్నా పై చెయ్యి అయింది. ఆరు నెలలుగా కత్తి పట్టక, సుఖ భోగాల్లో వున్న రాకుమారుడు చివరకు చిత్తుగా గుణశేఖరుడి చేతిలో ఓడిపోయాడు.

గుణశేఖరుడు అతన్ని దయతలచి వదిలేశాడు. రాకుమారుడు అవమాన భారంతో వెళ్ళి పోయాడు. రాకుమారికీ, గుణశేఖరుడికీ వివాహం జరిగింది.

కరాళుడు ఇంత వరకే వివరంగా ఈ కథ చెప్పి, "రాజు గుణశేఖరుడిని ఎందుకు క్షమించినట్టు? ఆరు నెలలూ కొత్తగా అతడికి కత్తి యుద్ధం ఎందుకు నేర్పించినట్టు? రాకుమారి ఆ రాకుమారుణ్ణి తండ్రి దగ్గరకు పంపటంలో గల అర్థం ఏమిటి? ఓ సవిత్ర్యక మహారాజా! వీటన్నిటికీ నీవు సమాధానాలు చెప్పగలిగి నవ్వుడే నీ మనుగుడ. లేదా...." అని, ఏదో అనబోయేంతలో, సవిత్ర్యకుడు అందుకుని యీ రకంగా జవాబు చెప్పాడు.

"స్త్రీ ఒక్కసారే మనస్సు అర్పించగలదు.



తాను మెచ్చినవాడు పరులకు సేవకుడు కావచ్చు. వంచకుడు కావచ్చు. తనకి ప్రియుడు. ఆ రకంగా రాకుమారి గుణశేఖరుడినే తన భర్తగా నిశ్చయించుకుంది. తన గూఢచారుల వల్ల గుణశేఖరుడూ, తన కూతురూ ప్రేమించుకున్నారని తెలుసుకున్న రాజు, ఏదైనా చేసేవాడైతే, వెంటనే గుణశేఖరుడిని చంపించే వాడు. ఒక్కగా నొక్క కూతురు కోరిక తీర్చటమే రాజు ధ్యేయం కనుక. ముందు మనస్తాప పడ్డా, చివరకు గుణశేఖరుడే తన అల్లుడు అని నిశ్చయించుకున్నాడు. మానసికంగా రాకుమా ర్తె, రాజు కూడా గుణశేఖరుడు తమవాడని అనుకుంటూ వుండగా, పొరుగు దేశపు రాకుమారుడు

వచ్చాడు. గుణశేఖరుడి గురించి అసలు వివరాలు తెలిశాయి. అతణ్ణి చంపి, రాకుమార్తెను పొరుగుదేశపు రాకుమారుడికి అంటగట్టవచ్చు. మోజు తీరాక, ఏదో నాడతడు, 'నీవు నా సేవకుడిని ప్రేమించిన హీనురాలువు,' అని నిరశించ వచ్చు. అది కాదని రాజు గుణశేఖరుడికే తన కూతురిని యివ్వ నిశ్చయించుకున్నానని చెప్పి, పొరుగుదేశపు రాకుమారిడిని పంపివేసే పక్షంలో, ఆ రాకుమారుడు, 'నా భటుడిని పెళ్ళాడిన రాకుమారి,' అని దుష్ప్రచారం చేయువచ్చు. అందుకని రాజు ఆరు నెలలు వ్యవధి అడిగి, గుణశేఖడికి కత్తి యద్ధం నేర్పించాడు. ఆరు నెలలు తర్వాత, రాకుమారుడితో కత్తి యుద్ధం చేయవలసి వుంటుందనీ, అతడు చేసిన వంచనకు బదులుగా రాకుమారుడిని గెలిస్తేనే మనుగడనీ, లేని పక్షంలో రాకుమారుడి చేతిలో చావవలసి వుంటుందనీ చెప్పాడు రాజు. భయంతో రాత్రులూ పగలూ నిద్రపోకుండా పట్టుదలతో గుణశేఖరుడు కత్తియుద్ధం నేర్చుకున్నాడు. చివరకు అతడు గెలవటం జరిగింది. అతడు గెలిచే పక్షంలో రాకుమారుణ్ణి చంపవద్దని రాజు ముందుగానే గుణశేఖరుడికి చెప్పాడు. అలా చేయటం వల్ల, ఒక భటుడిగా గుణశేఖరుడు ప్రారంభమై, పొరుగుదేశపు రాజు అంతరంగిక సలహాదారుడి హోదా వరకు పెరిగాడనీ, అంతేగాక కత్తి యుద్ధంలో ఒకప్పుడు తన యజమానిని మించిన వీరుడన్న పేరు పొందకలిగాడు. అటువంటి పేరు ప్రఖ్యాతులు తెచ్చి, ఆ తర్వాత గుణశేఖరుణ్ణి తన అల్లుడిగా చేసుకున్నాడు రాజు."

సరియైన సమాధానం రావటంతో సవిత్యుకుడి కెదురుగా వున్న యువతిపై కరాళుడి ప్రభావం నశించి, ఆ కన్య చిరుతపులిగా మారి అడవిలోకి భయంతో పరుగు తీసి, ఒక పెద్ద చెట్టు ఎక్కి కూర్చుంది.





## రాజు-ధర్మదేవత

రామాపురం అనే గ్రామంలో కృష్ణశర్మ అనే సద్బ్రాహ్మణుడు వుండే వాడు. అతడు సకల విద్యాపారంగతుడు తనకు వచ్చిన విద్యను ఉచితంగా అందరికీ నేర్పే వాడు. వివాహాది శుభ కార్యాలకు శుభముహూర్తాలు నిర్ణయించటంలోనూ కూడా అతడికి అఖండ ప్రజ్ఞ ఉన్నది.

కృష్ణశర్మ యింటిలో ఎప్పుడూ పది మంది విద్యార్థులు వేదాధ్యయనం చేస్తూ వుండే వారు. జనంలో అతడి ఇల్లు ఎప్పుడూ కళకళలాడుతూండేది

దేహీ అని ఎవరినీ యాచించక పోవటం వల్ల, కృష్ణశర్మ డబ్బుకు చాలా యిబ్బంది పడేవాడు. శిష్యులకు, తన యింటికి వచ్చిన వారికి కూడా అతడు శక్తి కొలదీ అతిథి మర్యాదలు చేసే వాడు.

సంపాదన లేదు సరిగదా ఖర్చులు పెరుగుతూండటం వల్ల కృష్ణశర్మకు తలిదండ్రులు ఇచ్చిన ఆస్తి కూడా హరించుకొని పోసాగింది.

ఇప్పుడు అతడికి పెళ్ళీడుకి ఎదిగిన కూతురు వుంది. విద్యాభ్యాసం చేస్తున్న ఇద్దరు మగపిల్లలు వున్నారు.

కృష్ణశర్మ భార్య గుణవతికి తన పిల్లల భవిష్యత్తు గురించి బెంగ పట్టుకుంది. అయినా భర్త మనసు నొప్పించకూడదని అమె ఏమి అనేది కాదు.



ఇలా ఉండగా, ఒక రోజున కృష్ణ శర్మ కూతురిని చూచుకునేందుకు పెళ్ళివారొచ్చారు. వారికి పిల్లనచ్చింది. అప్పటి కప్పుడు జాతకాలు పరిశీలించగా ఒక సంవత్సరకాలం వరకూ శుభ ముహూర్తం లేదని తేలింది. అప్పుడే పెళ్ళి జరిపించమని చెప్పి పెళ్ళివారు వెళ్ళి పోయారు.

వాళ్ళు వెళ్ళిపోయాక గుణవతి దిగులుగా, "సంవత్సరం తర్వాత ఈ పెళ్ళి ఎలా చేస్తాం? పెళ్ళంటె చాలా ఖర్చవుతుంది కదా!" అంది.

అందుకు కృష్ణశర్మ, "ఆ దిగులు నాకూ ఉంది. అన్నింటికీ ఆ భగవంతుడే ఉన్నాడు," అన్నాడు.

"హోరు గాలిలో దీపం పెట్టి, దేవుడా నీదే భారమంటే ఏమి ప్రయోజనం? మీరు నోరు విడిచి ఎవరిని అడిగినా కనకవర్షం కురుస్తుంది," అన్నది గుణవతి.

మే
బొమ్మల సంభాషణ
ఫలితాలు-1



పోస్టుమాన్ : నేటి నుంచీ నాకు చెడ్డ రోజులు మొదలవుతాయని ఎంత ఖచ్చితంగా చెప్పావయ్యా! అలిగి పుట్టింటిలో సంవత్సరం నుంచి మకాం వేసిన మా ఆవిడ ఈరోజే వస్తూన్నానని వుత్తరం వ్రాసింది
జ్యోతిష్కుడు : చిలుక జోస్యం అంటే ఏమను కున్నావు మరి!
—యన్. హరికిషోర్, తిరుపతి

"నోరు విడిచి అడిగితే అది యాచన అవుతుంది. అడగకుండా యిచ్చినదే ప్రతిఫల మవుతుంది. మన పెరట్లో వృక్షాలు చూడు. చిన్నతనంలో వాటికి నీరు పోసి పెంచాము. ఇప్పుడవి అడ క్కుండానే రుచికరమయిన ఫలాల నిస్తున్నాయి." అన్నాడు కృష్ణశర్మ.

"వాటవల్లనే మనకు రోజులు కాస్త గడుస్తున్నాయి. మీరు చెప్పినది నిజం. పెరట్లో ఖాళీ స్థలం వున్నది. మరి కాసిని ఫలవృక్షాలైనా నాటండి," అన్నది గుణవతి ఉక్రోషంగా.

ఆమె ఆ మాటలు ఉక్రోషంగా అన్నప్పటికీ, కృష్ణశర్మ నిజంగానే గునపం తీసుకుని పెరట్లోకి వెళ్ళాడు. ఒక చోట అతడు తవ్వేసరికి, అడుగు నేలలో ఖంగుమన్న శబ్దం అయింది మరికాస్త తవ్వి చూడగా, పురాతన

మే
బొమ్మల సంభాషణ
ఫలితాలు- 2



పోస్టుమాన్ : పిచ్చికుక్క వెంటపడింది. దాన్ని తప్పించుకోవటానికి మార్గం ఏదో త్వరగా చెప్పవయ్యా?
జ్యోతిష్కుడు : ఓ అర్థ రూపాయి ఇచ్చి అయిదు నిమిషాలు ఆగితే, చిలుక నడిగి చెప్తాను.
—టి. యం. ఇందిరాప్రియాంక, రాయదుర్గ్



కాలపు రాగి బిందె ఒకటి అక్కడ వుంది దాని నిండుగా బంగారు నాణేలు వున్నవి.

గుణవతి పరుగున పెరట్లోకి వచ్చి, "ధర్మదేవత మనను కరుణించింది. మన కష్టాలు అన్నీ ఈనాటితో తీరి పోయాయి." అన్నది సంతోషంగా.

అందుకు కృష్ణశర్మ నవ్వి, "ఇంత కాలం నేను సియమం తప్పకుండా జీవించాను. నీతినే నమ్ముకుని బ్రతి కాను. భూమిలో ఉండే సిధి సికేపాలు మనవి కావు రాజు చెందుతాయి. దీనిని రాజు కప్పగించటమే బాధ్యత," అని భార్య ఎంత చెపుతున్నా వినక, ఆ బిందెను తీసుకుని వెళ్ళి, ఆ దేశపు రాజు శూరసేనుడికి ఇచ్చాడు.

రాజు అతణ్ణి మెచ్చుకుని పంపే శాడు.

"కనీసం మీ న్యాయబుద్ధికి మెచ్చుకుని మంచి బహుమతినైనా యివ్వలేదు ఆ రాజు," అంటూ తిరిగి వచ్చిన భర్తను చూచి బాధ పడింది గుణవతి

మంచి పౌరుడిగా నా బాధ్యత నిర్వహించాను. బాధ్యతకు ప్రతిఫలాన్ని



సుబ్రావు : అదేమిటోయ్, శేఖర్? ఎప్పుడు చూచినా పుస్తకాల అంగడిలోనే వుంటావు. మరి కాలేజీకి వెళ్ళి ఎప్పుడు చదువుతావు?

శేఖర్ : అయ్యో, నేను చదువుకోటానికే సదా పుస్తకాల అంగడిలో ఉండేది!

—గోపీక్రిష్ణ
నెల్లూరు

మే
బొమ్మల సంభాషణ
ఫలితాలు - 3



పోస్టుమాన్ : నేను ఈ వీధికి కొత్తగా వచ్చిన పోస్టుమాన్ని. ఈ ఉత్తరంలోని చిరునామా దొరక్క చస్తున్నాను. కాస్త, నీ చిలుకను అయినా అడిగి చెప్పి పుణ్యం కట్టుకోరాదా?

జ్యోతిష్కుడు : ఉండవయ్యా నీదొక సోది! నిన్నటి నుండి జ్వరంతో వున్న ఈ చిలుక అన్నీ తప్పు జోస్యాలే చెప్పి ప్రొద్దుటి నుంచీ నా తల వాచిపోయేటట్లు చాలా మంది చేత తిట్టించింది. దానితో తలకి గుడ్డ చుట్టుకొని కూర్చున్నా బోణీ కాక ఏడుస్తూ....

—అన్నం వెంకటేశ్వర్రావు,
నర్సరావుపేట

ఆశించటం మంచి పౌరుడి లక్షణం

కాదు," అంటూ భార్యను మందలించాడు కృష్ణశర్మ.

మరుసటి ఉదయం ఒక మామిడి మొక్కను తాను తీసిన గోతిలో నాటాలని కృష్ణశర్మ అనుకుని వెళ్ళే సరికి, అతడికి అందులో చిత్రంగా మరో రాగి బిందె కనపడింది. అందులోనూ నిండుగా బంగారు నాణేలు వున్నాయి.

జరిగిన అద్భుతానికి ఆశ్చర్యపడినప్పటికీ, కృష్ణశర్మ మళ్ళీ ఆ బిందెను కూడా రాజుకే తీసుకుని వెళ్ళి ఇచ్చాడు.

అలా ఒక మాసం రోజుల పాటు కొనసాగింది.

రోజూ తనకో రాగి బిందెడు బంగారు కాసులు తెచ్చిస్తున్న కృష్ణశర్మ మీద రాజుకు ఆసక్తి కలిగింది. ఒకే యింటి





రాజు : ఇంత అర్ధరాత్రి వేళ బయలుదేరావు, ఎక్కడి కోయ్, బైరాగీ?

బైరాగి : ఆత్మహత్య చేసుకోవటానికి, రాజూ!

రాజు : చేతిలో ఆ బ్యాటరీ లైట్ ఎందుకూ?

బైరాగి : దారిలో పాములు వుండి తెలియకుండా కాటేస్తే ఎలా? అందుకని....

— ఋషిశ్రీ,
కమ్మపాళెం

పెరట్లో అన్ని బిందెలు దొరకటము విచిత్రంగా తోచి, అంత వరకూ కృష్ణశర్మ తెచ్చిన బంగారు కాసులు ఎన్ని వున్నాయో లెక్క చూడమని కోశాధిపతికి చెప్పాడు రాజు.

కోశాధిపతి వెళ్ళి చూచేసరికి, కోశాగారంలో ఎంత వెతికినా ఒక్క రాగి బిందె కూడా లేదు. అతడు గుండె



బాదుకుంటూ వెళ్ళి రాజుకు ఆ విషయము చెప్పాడు. రాజు కూడా దీనికి ఎంతో ఆశ్చర్యపడి, అసలు విషయం

పరిశోధించాలని అనుకున్నాడు.

కాసేపటికి ఎప్పటిలాగే, కృష్ణశర్మ రాగి బిందెను తీసుకుని రాజును చూడ



వచ్చాడు. రాజు ఆ బిందెను తానే స్వయంగా దాచటమే కాక, బిందె మీద తన పేరు కూడా వ్రాశాడు. కాని,

మే
బొమ్మల సంభాషణ
ఫలితాలు - 4



పోస్టుమాన్: నీ పేరుగల ఉత్తరాలు చాలా వచ్చాయి. రామనాథం! ఇందులో నీ ఉత్తరం ఏదో తెలియటం లేదు నాకు.

రామనాథం: వాటిని ఇలా పడేయ్! మా చిలుక ముందు పెడుతాను. అది ఏ ఉత్తరం తీస్తే అదే తీసుకుంటాను నేను.

— ఇట్లా లక్ష్మి శ్రీనివాసరామం,
ధవళేశ్వరం

మర్నాటి కల్లా ఆ బిందె మాయ మయింది. కృష్ణశర్మ ఎప్పటి లాగా మరునాడు మరో బిందె తీసుకుని వచ్చాడు.

శూరసేనుడా బిందెను పరిశీలించి చూడగా దానిపై స్వహస్తాలతో వ్రాసిన తన పేరు కనపడింది. అప్పుడు రాజుకు




కలిగిన ఆగ్రహం ఇంతా అంతా కాదు.

తక్షణం కృష్ణశర్మపై చోర నేరం అభియోగించి, కారాగారంలో పడవే యించాడు.

రాజుకు తనపై ఆగ్రహం ఎందుకు కలిగిందో, తను చేసిన నేరమేమిటో కూడా తెలియని కృష్ణశర్మ విచారంగా కారాగారంలో ఉండగా, కాసేపటికి ఒక భటుడు అతడి వద్దకు వచ్చి, "అయ్యా, జరిగిన పొరపాటుకు రాజు గారు ఎంతో విచారించారు. తమరిని ఇంటికి వెళ్ళి పోవచ్చునని చెప్పారు," అంటూ తలుపులు తెరిచాడు.

'రాజుల మనసులు చిత్రమైనవి,' అని అనుకుంటూ కృష్ణశర్మ ఇంటికి వెళ్ళి పోయాడు. అయితే జరిగినదేమీ తన భార్యకు చెప్పలేదు

గుణవతి మాత్రం, "ఇలా ఎంత కాలమని ప్రతి రోజూ రాజదర్శనానికి వెళతారు? ఇందువల్ల, మీ శిష్యులకు విద్యాదానం కూడా ఆగి పోయింది," అన్నది.

"అంతా ఆ భగవంతుడి నిర్ణయం," అని ఊరుకున్నాడు కృష్ణశర్మ.

మర్నాడు అతడికి తన పెరటి గోతిలో మరో రాగి బిందె కనబడింది. కృష్ణశర్మ తటపటాయించ కుండా దానిని కూడా తీసుకుని రాజదర్శనానికి వెళ్ళాడు.

శూరసేనుడు కృష్ణశర్మను చూచి ఆశ్చర్యపడి, "నిన్న నిన్ను కారాగారంలో పడవేయించాను కదా? ఈ బిందె నీకు కారాగారంలో దొరికిందా?" అన్నాడు కృష్ణశర్మ.

"ముందు తమరు నన్ను కారాగారంలో పడవేయించారు. తర్వాత దయతో మనసు మార్చుకుని నన్ను విడిపించారు," అంటూ జరిగినది చెప్పాడు కృష్ణశర్మ.

అప్పుడు రాజుకు తన భటుల మీద అనుమానం వచ్చింది. రోజుకో బిందెడు బంగారు కాసులు రాజుకే యివ్వగల కృష్ణశర్మ భటులకు కూడా ఎంత బంగారమైనా కానుకగా యివ్వగలడు. అందుకు ఆశపడి ఏ భటుడో అతణ్ణి విడిపించి ఉంటాడు.

"నిన్ను విడిపించిన భటుడిని గుర్తు పట్టి చెప్పగలవా?" అని అడిగాడు రాజు.

కృష్ణశర్మకు వారిలో తనను విడిపించిన భటుడు కనపడలేదు. ఆ విషయం శూరసేనుడికి చెప్పాడు.

"నీవు నిజం చెప్పటం లేదు. వీరిలో నిన్ను విడిపించిన వారెవరో చెప్పు," అన్నాడు శూరసేనుడు కోపంగా.

కృష్ణశర్మ తాను నిజమే చెపుతున్నానని ఎంత మొత్తుకున్నా రాజు వినలేదు.

చివరికి రాజు, "నిజం చెప్పకపోతే నీకు శిరచ్ఛేదమే తగిన శిక్ష!" అన్నాడు.

అయినప్పటికి కృష్ణశర్మ తనకు ఏమీ తెలియదనే అన్నాడు.

రాజు అప్పటికి అప్పుడు ఇద్దరు భటులను రావించి, కృష్ణశర్మను అరణ్య మధ్యలోకి తీసుకుని వెళ్ళి శిరచ్ఛేదం కావించమని చెప్పాడు.

శూరసేనుడి మంత్రి సుబుద్ధి చాలా కాలంగా ఈ వ్యవహారం కనిపెడుతూనే ఉన్నాడు.

అతడు రాజుతో, "ప్రభూ, తమకు బ్రహ్మహత్యాపాతకము చుట్టుకుంటుంది. శిక్ష విషయంలో మరొక్కసారి ఆలోచించండి." అన్నాడు.

"విద్య నేర్చిన వాడు బ్రాహ్మణుడు కాని, నేరస్థుడు బ్రాహ్మణుడు కాదు. నేరస్థులను శిక్షించటం రాజధర్మం.

మే
బొమ్మల సంభాషణ
ఫలితాలు-5



పోస్టుమాన్ : అయ్యా, ఈ కార్డు మీద చిరునామా లేదు. మీ చిలుకతో ఆ చిరునామా తెలుసుకొని చెపితే, మీకు ఎంతో పుణ్యం వస్తుంది.

జ్యోతిష్కుడు : ఓ అర్థ రూపాయి అవుతుంది మరి! పుణ్యం అంటావా అది సంపాదించి ఏం చేసుకోనూ?

— హెచ్. ఆర్. ఎల్. శాస్త్రి, కొవ్వూరు

ఈ విషయంలో మీరు జోక్యం చేసుకొనవద్దు," అని మంత్రిని మందలించాడు రాజు.

"అంత వరకూ జరిగిన దాన్ని బట్టి చూడగా, ఈ బ్రాహ్మణుడు ఈ శిక్షను కూడా తప్పించుకొనగలడని నాకు తోస్తున్నది," అన్నాడు సుబుద్ధి.

"అది అసంభవం." అన్నాడు శూరసేనుడు నమ్మకంగా.

అయితే, మరుసటి దినం కృష్ణశర్మ యథా ప్రకారం మరో రాగి బిందెను మోసుకుని, రాజదర్శనానికి వచ్చాడు. దానిపై శూరసేనుడు స్వహస్తాలతో వ్రాసిన పేరున్నది.

"మళ్ళీ ఎలా వచ్చావు?" అన్నాడు శూరసేనుడు ఆశ్చర్యంగా.

"ప్రభూ, తమరు నన్ను పరీక్షిస్తున్నారు. నిన్న మేము సగం దారిలో ఉండగా, తమరు పంపిన దూత రాజశాసనంతో వచ్చి నన్ను విడిపించి వెళ్ళిపోయాడు," అన్నాడు కృష్ణశర్మ.



"ఎవడు ఆ దూత?" అన్నాడు శూరసేనుడు.

కృష్ణశర్మ ఆ దూత ఎవరో చూచి గుర్తు పట్టలేక పోయాడు.

రాజు కృష్ణశర్మను చంపటానికి నియోగించిన భటుల కోసం కబురంప బోగా, "ప్రభూ, వారం దినాలు సెలవు తీసుకోమని నిన్న తమరు వారిని రాజ శాసనం ద్వారా ఆదేశించారు. వారు తమ తమ గ్రామాలకు వెళ్ళి పోయారు," అన్నాడు కృష్ణశర్మ.

శూరసేనుడు కోపంగా, "నీవు ఒక మాయావివి. నిన్ను నేనే స్వయంగా హతమార్చగలను," అని కత్తి దూయ బోగా, మంత్రి సుబుద్ధి వారించి, "ప్రభూ, అతడిని ధర్మదేవత కాపాడు తున్నదని నా అనుమానం. తమరు ఆవేశపడక, విషయాన్ని కూలంక పంగా చర్చించ వలసి ఉన్నది," అన్నాడు.

కృష్ణశర్మ తిరిగి వస్తాడన్న విషయం ముందుగానే ఊహించిన సుబుద్ధి బుద్ధి చాతుర్యాన్ని గౌరవించి, కృష్ణశర్మను ఏకాంతానికి పిలిచి, సుబుద్ధి సమక్షంలో



నిగ్రహంగా విషయాన్ని చర్చించాడు శూరసేనుడు. అప్పుడు రాజుకు కృష్ణ శర్మ స్వీయ వృత్తాంతం తెలిసింది.

"నీవు చెపుతున్నది నమ్మ తగ్గదిగా లేదు." అన్నాడు రాజు.

"ప్రభూ, అతడి గురించి నేను ఆరా తీశాను. ఆతడు నిజమే చెపు తున్నాడు," అన్నాడు సుబుద్ధి.

"అతడి గురించి నీవు ఎందుకు ఆరా తీశావు?" అన్నాడు శూరసేనుడు.

"ప్రభూ, తమరే నిదానంగా ఆలోచించండి. ఒక పేద బ్రాహ్మణుడు ప్రతి దినం మీకు బంగారు కాసులు తెచ్చి యిస్తున్నాడు. మీరు తన మీద నేరారోపణ చేసినా, అతడు చలించ లేదు. మీరు శిరచ్ఛేదం చేస్తానని బెదిరించినా, ఏదో ఒక భటుణ్ణి చూపించి, తన ప్రాణాలు రక్షించుకోవాలని తలచని నిజాయితీపరుడు. ఇతడిని ధర్మదేవతే కాపాడుతున్న దన్న నమ్మకం కలిగి నేను విషయం ఆరా తీశాను," అన్నాడు సుబుద్ధి.

"అయితే, ఇతడు రోజూ నాకు బిందె తెచ్చి ఇవ్వటం ఎందుకు? అవి మాయం కావట మెందుకు?" అన్నాడు శూరసేనుడు.

"ప్రభూ, నిధి నిక్షేపాలను రాజు ధనంగా భావించి, కృష్ణశర్మ మీకు తెచ్చిస్తున్నాడు. కాని, రాగి బిందెలోని బంగారు కాసులు నిధినిక్షేపం కాదు. ధర్మదేవత అతడికి ఇచ్చిన బహుమతి. అది గ్రహించక, మీరు ఆ కాసులు తీసుకుంటుంటే, ధర్మదేవత తిరిగి అవి



తండ్రి : ఒరే, రాముూ! కలం స్నేహము ఎందుకు చేస్తారురా?

రాము : తన పెన్ (కలం) రిపేర్‌లో వున్నప్పుడు కలం స్నేహితుడి పెన్ వాడుకొనేందుకు, నాన్నా!

— గోపీక్రిష్ణ,
నెల్లూరు

తానే అతడికి చేరవేస్తున్నది. నిజానికి ఆ కాసులు కృష్ణశర్మవి. ఆ సొత్తును మీరు అతడికి దానంగా యివ్వండి. తిరిగి అతడికి తన ఇంటి పెరటి గోతిలో కాసుల బిందె కనపడదు," అన్నాడు సుబుద్ధి.

"ధర్మదేవతే కృష్ణశర్మ కాబందెను కానుకగా యిచ్చిందని నీవు ఎందుకు భావిస్తున్నావు?" అన్నాడు రాజు ఆశ్చర్యంగా

"తమరు కృష్ణశర్మ నిజాయితీని సత్కరించాలని ఎన్నడూ అనుకోలేదు. కాని, అతడిపై అనుమానం కలగ్గానే అతడిని శిక్షించాలని అనుకున్నారు. ఏ దేశంలో రాజు తన ప్రజల యోగ క్షేమాలను స్వయంగా విచారించ లేకున్నాడో ఆ దేశ ప్రజలు ప్రతి ఫలానికి ధర్మదేవత పైనే ఆధారపడతారు. ధర్మదేవతిచ్చే ప్రతిఫలంలో రాజుకు హక్కు వుండదు," అన్నాడు సుబుద్ధి.

తన పరిపాలనలో లోపమున్నదనీ, అందువల్ల కృష్ణశర్మవంటి ప్రతిభాసంపన్నులు ఎందరో కష్టపడుతున్నారనీ గ్రహించిన రాజు, కృష్ణశర్మకి ఆ రాగి బిందెను దానంగా యిచ్చి, తర్వాత సుబుద్ధి సహాయంతో తన లోపాలన్నీ దిద్దుకుని, చాలా ఏళ్ళు ప్రజా రంజ



కముగా పాలన చేశాడు.

ఇది విన్న మహారాణి, 'ప్రజలకు రాజే ధర్మదేవత. రాజు రాజలా మసల నప్పుడు ప్రజలు ధర్మదేవత పైనే తప్పక ఆధార పడాలి. నా భర్తను ప్రజలు ధర్మదేవత అని కొనియాడేలా చేయటం మహారాణిగా నా బాధ్యత,' అని అనుకుంటూ వెళ్ళి పోయింది.

మర్నాడు యథాప్రకారం యథా సమయానికి యథా స్థలంలో వినయ శీలుఋష్టి నావహించుకుని ఉన్న నూరు కట్ల పిశాచం మరో కథను ప్రారంభించింది.

—(వచ్చే నెల మరో కథ).



# పువ్వుల పుట్టుక



బ్రహ్మమానస పుత్రులైన సనకుడు, సనందుడు మొదలైన మహా మునులకి, భూమి సృష్టింప బడిన తొలి రోజుల్లో అక్కడున్న తాపసులకి కావలసిన నిర్మలత్వం ప్రశాంతత చుట్టూ వున్న పరిసరాలలో ఎక్కడా కనబడ లేదు. వాళ్ళు అటువంటి వాతావరణాన్ని సంపాదించుకోవాలనుకున్నారు.

వారందరూ వనదేవతని ఏకాగ్రతతో ధ్యానం చేయ సాగారు. కాని, ఎన్నాళ్ళకూ వనదేవత వారికి ప్రత్యక్షం కాలేదు. అలా చాలా ఏళ్ళు గడిచి పోయాయి.

ఒక రోజు మునులందరూ అలా ధ్యానంలో వుండగా, ఆకాశం నుంచి ఏదో అశరీరవాణి ఇలా పలికింది.

"మీరు కోరుకున్నది జరగాలీ అంటే ఆదిపరాశక్తిని శ్రద్ధా భక్తులతో ప్రార్థించండి. ప్రయోజనం కలుగుతుంది."

వెంటనే మునులు అందరూ స్వర్గలోకానికి ప్రయాణమై వెళ్ళారు. విశ్వకర్మ చేత ఆదిపరాశక్తి ప్రతిమని చేయించారు. ఆ పైన కామధేనువును అర్థించి, ఓ బంగారపు పాత్ర నిండా స్వచ్ఛమైన క్షీరాన్ని సేకరించి, భూలోకానికి తిరిగి వచ్చారు మునులు.

ఆపైన వారు ఆదిపరాశక్తి ప్రతిమని ఒక చోట ప్రతిష్ఠించారు. క్షీరం వున్న పాత్రని ఆ ప్రతిమ ముందు వుంచి పూజలను ప్రారంభించారు. కుశాగ్రాసాల్ని క్షీరపాత్రలో ముంచి ప్రతిమ పైకి ఆపాద మస్తకం చల్లుతూ స్తోత్రం చేయటం మొదలు పెట్టారు.

వెంటనే ఒక అద్భుతం జరిగి మునులకు ఆశ్చర్యాన్ని కలిగించింది. అదేమిటంటే, ప్రతిమ మీద పడిన ప్రతి క్షీర బిందువూ ఒక్కొక్క రకం పువ్వుగా మారిపోవటమే కాక, ప్రతిమని పూర్తిగా కప్పివేస్తూ గొప్ప పరిమళాల్ని వెదజల్ల సాగింది.

అంతలో ఆదిపరాశక్తి వారికి ప్రత్యక్షమయి, "అభీష్ట సిద్ధిరస్తు!" అంటూ ఆశీర్వదించింది.

మునులు అందరూ ఆనందంతో ఆమెను పలు విధాలుగా స్తోత్రం చేశారు.

ఆదిపరాశక్తి అదృశ్యము అయిపోతూ బంగారపు పాత్రలో వున్న క్షీరాన్ని స్వహస్తాలతో భూమి మీద వున్న వృక్ష జాతులు అన్నిటి మీదా చిలకరించింది.

ఆ తరవాతనే భూమి పైన వుండే తరువులూ, లతలూ గుల్మాలూ, ఔషధులూ రకరకాలుగా పువ్వులు పూయటం మొదలు పెట్టాయి. నందనోద్యానవనాన్ని మించి పోయిన ఆహ్లాదకరమైన వాతావరణంతో భూమి కళకళలాడింది.

ఇలా పువ్వుల పుట్టుకతో తాపసులు మనోరథమూ నెరవేరింది.

—కమలిని



# దయ్యం పందెం

నరసింహాపురానికి అనుకుని వున్న చిట్టడవిలో ఒక చింతచెట్టు మీద చాలా కాలంగా పాడుగాటి దయ్యం ఒకటి కాపురం వుంటూండి ఒక రోజు ఆ చెట్టు మీదకే ఎక్కడి నుంచో ఒక పొట్టిదయ్యం వచ్చి చేరింది.

పాడుగుదయ్యం పొట్టిదయ్యాన్ని చూచి సంబరపడి పోతూ, "ఇన్నాళ్ళు ఒక్క దానికీ ఊసుపోక పొద్దు గడవటమే కష్టంగా వుంది. ఇక నుంచి యిద్దరం కబుర్లు చెప్పుకుంటూ సంవత్సరాలే దొర్లించేయ వచ్చు," అంటూ ఆహ్వానించింది.

అలా నాలుగు రోజులు గడిచేసరికి, పొట్టి దయ్యానికి అడవిలో ఏకాంత వాసం విసుగు పుట్టి పొడుగుదయ్యంతో, "అన్నా, యిలా ఒంటి పిల్లిల్లాగా బతకటం కన్నా పట్టణం లోకి పోయి మనుషులు మసిలే ఏ కొంపో పట్టుకుంటే బాగుంటుండేమో!" అన్నది.

పొడుగుదయ్యం పొట్టిదయ్యాన్ని ఒకసారి ఎగాదిగా చూచి, "నువ్వు చచ్చి దయ్యమై ఏడాది కూడా కానట్టుంది. అందుకే మనుషులంటే యింక భ్రమ పోలేదు. మనుషులతో వేగలేకనే కదా, ఇలా ఏభయ్ ఏళ్ళుగా యీ చెట్టుని ఆశ్రయించుకుని వుండి. పట్నవాసం మనుషులు అంటూ అనవసరంగా వాగకు," అని మందలించింది.

పొట్టిదయ్యం ఆశ్చర్యపడి, "నువ్వు ఇక్కడ చేరి ఏభయ్ ఏళ్ళయిందా? ఇదంతా మనుషులంటే భయం వల్లనే? దయ్యాలంటే మనుషులు భయపడటం చూశాను. కాని, మనుషుల్ని చూచి దయ్యాలు భయపడటం నీ దగ్గర నుంచి నేర్చుకోవలసి వచ్చేలాగా వుంది," అంటూ ఎగతాళిగా మాట్లాడబోయింది.

"నీకు అనుభవం లేదని నీ మాటలే చెపుతున్నాయి. మనుషుల మధ్య కాపురమా? మనుషులు మన కన్నా చాలా తెలివైన వాళ్ళు

జొన్నలగడ్డ రత్న

సాటి వాళ్ళనే తమతో కలసి బతకనివ్వని వాళ్ళకి దయ్యాలో లెక్కా? మంత్రగాడినో, తంత్రగాడినో పిలిచి వీధిలోకి నెట్టిస్తారు. అందు చేత, దయ్యాలకి పాడుపడ్డ కొంపలో నిర్జన ప్రదేశాల్లోని చెట్లుచేమలే కాపురానికి మంచివి," అంది పొడుగుదయ్యం.

"ఎదుటివాడి కన్నా తక్కువగా అంచనా వేసుకుని, తనని తాను చిన్నబుచ్చుకోవటం కన్నా అవలక్షణం మరొకటి వుండదు. అవకాశమే రావాలి కాని దయ్యాల తెలివితేటలు ఎలాటివో నీకు చూపిస్తాను. ఇక నుంచి పిరికి మాటలు మాట్లాడటం మానేయ్," అని పొట్టి దయ్యం పొడుగుదయ్యానికి ఎదురు చెప్పింది.

పొడుగుదయ్యం విరగబడి నవ్వి, "నీకు కుర్రతనం పోలేదు. మనుషులు మనమంటే హడలి చచ్చేది మన ఆకారాన్ని చూచి కాని. మన తెలివితేటల్ని చూచి కాదు!" అంది.

"తెలివి తేటల్లో దయ్యాలు మనుషులకేం తక్కువ కాదని నిరూపిస్తాను. అప్పుడు నువ్వు యీ చెట్టు వదిలి పెట్టి, పట్నంలో నే నెక్కడ వుండ మంటే అక్కడికి వచ్చి వుండాలి. అలా నేను చెయ్యి లేకపోతే యీ చెట్టు మీద నీతో పాటే పడి వుంటాను," అంది పొట్టిదయ్యం.

"అలాగే కానీయ్." అని నవ్వేసి వూరుకుంది పొడుగుదయ్యం.

ఇంతలో అడవి దారిన నడిచి పోతున్న



సీతయ్య అనే ఆసామి కాసేపు విశ్రాంతి తీసుకుందామని దయ్యాలు వున్న చింతచెట్టు క్రిందకే వచ్చి, భుజాన వున్న తుండు గుడ్డ పరిచి నడుం వాల్చాడు.

పొట్టిదయ్యం ఉత్సాహంతో, "మన తెలివి తేటలు యీ మనిషి మీద ప్రయోగిద్దామా?" అని అడిగితే, పొడుగు దయ్యం. "సరే!" అంది.

దయ్యాలు రెండూ వెంటనే బాటసారుల్లాగా రూపాలు ధరించి, చింత చెట్టు వెనక వున్న తొర్రలోంచి బంగారు కాసులున్న చెరో మూటా తీసుకుని, సీతయ్య పక్కకి వచ్చి చేరాయి. వాటి అలికిడికి సీతయ్య ఉలిక్కిపడి లేచి కూర్చున్నాడు.



దయ్యాలు రెండూ అతడితో పలకరింపుగా "మాది యిక్కడికి దగ్గర్లో వున్న పల్లెటూరు. నరసింహపురం సంతలో సరుకులు అమ్మి యింటికి పోతున్నాం." అన్నాయి.

అంటూనే కావాలనే తమ దగ్గర వున్న కాసుల మూటల్ని కిందకి కుమ్మరించి లెక్క పెట్టటం మొదలు పెట్టాయి దయ్యాలు.

అంత డబ్బు చూడగానే సీతయ్య కళ్ళు జిగేల్ మన్నాయి.

అతడు పల్లెటూరి బాటసారుల వేషాల్లో వున్న దయ్యాల్ని చూచి. "ఇంత సొమ్ము సంపాదించాలంటే ఎంత కష్టపడాలో కదా!" అన్నాడు.

పొట్టిదయ్యం అదే అదనుగా, "తెలివి తేటలు వుంటే నిముషంలో సంపాదించ వచ్చు." అన్నది.

సీతయ్య ఏదో జ్ఞాపకం వచ్చిన వాడిలాగా, "అవును నిజమే! తెలివితేటలే వుండాలి కాని నోట్లోని నాలుకని కంటిపాపకి ముట్టించి పందేలు గెలుచుకోవచ్చు," అంటూ తన చొక్కా జేబులోంచి ఒక డబ్బు సంచీ తిసి, "ఈ సొమ్ము మా వూరి జమీందారుతో అలా పందెం వేసి సంపాదించినదే!" అన్నాడు.

పొట్టిదయ్యం అతణ్ణి అవహేళన చేస్తూ, "నాలుకని కంటిపాపకి ముట్టించి నువ్వు పందెం గెలిచావంటే ఏ దయ్యానివో భూతానివో అయివుండాలి కాని, మనిషివి మాత్రం కాదు," అంది.

అందుకు సీతయ్య మీసం మెలితిప్పుతూ, "తెలివి తేటలున్న మనిషికి చెయ్యలేని పనుండదు!" అన్నాడు.

"నువ్వు ఎవడివో కాని ప్రగల్బాలకోరులా గున్నావు. నువ్వు నీ నాలుకని కంటిపాపకి తాకించి చూపినప్పుడు కదా, నిన్ను నేను నమ్మేదీ!" అంది పొట్టిదయ్యం.

పొట్టిదయ్యం అలా అన్నాక, సీతయ్యకి బుర్రలో ఏదో ఆలోచన మెరిసి, "నువ్వు నమ్మినా నమ్మక పోయినా నాకు ఒరిగేదేమి ఉంది? కాని, నువ్వు నాతో పందెం కాస్తానంటే మాత్రం, నేను నాలుకతో కంటిపాపని తాకి నీకు చూపిస్తాను. నీ దగ్గరున్న కాసుల

సంచీ ఒకటి నాకిచ్చెయ్యాలి. అలా చేయలేక పోతే, నా దగ్గరున్న కాసుల సంచీ నీకు ఇచ్చేసి పోతాను," అన్నాడు.

ఇది వినగానే, పొడుగుదయ్యం పొట్టి దయ్యాన్ని పక్కకి రమ్మని సంజ్ఞ చేసి, రహస్యంగా, "ఈ మనిషి ఎవడో గట్టి పిండం లాగ కనపడుతున్నాడు. వీడు చెప్పింది చేసి, చూపించేట్టే వున్నాడు. అనవసరంగా నువ్వు ఇప్పుడు ఎలాంటి పందెం వేయవద్దు," అని హెచ్చరించింది.

పొట్టిదయ్యం నవ్వి, "నీకు దయ్యాల శక్తి కన్నా మనుషుల తెలివి మీద నమ్మకం కదా! తన నాలుకని ఎలా పడితే అలా పొడిగించి, ఒళ్ళంతా ముట్టు కోవటం చచ్చి దయ్యము అయితేనే కాని మనిషికి సాధ్యం కాదు. ఇతడి బండారం యిప్పుడే బయట పెడతాను," అంటూ సీతయ్యని పిలిచి, "నేను పందెం వెయ్యటానికి సిద్ధమే!" అంది.

సీతయ్య వెంటనే తన ఎడం కన్ను వూడ తీసి, దాన్ని అరచేతిలో పెట్టుకుని నాలుకతో స్పృశించాడు.

పొట్టిదయ్యం ఆశ్చర్యపోతూ, "అరెరె, అది గాజు కన్ను!" అంది.

సీతయ్య నవ్వి, "కన్నుని నాలుకతో ముట్టుకోవాలన్నదే పందెం కాని, అది గాజు కన్ను కాకూడదని నియమ మేమీ లేదుగా!" అన్నాడు.

పొడుగుదయ్యం పరిహాసంగా చూస్తుంటే, పొట్టిదయ్యం తన దగ్గరున్న కాసుల మూట సీతయ్య చేతిలో పెట్టింది.





అప్పుడు సీతయ్య విలాసంగా నవ్వి. "నీకు పోయిందేమీ లేదు. పందేనికి పైపందెం కాచి, కావాలనుకుంటే ఇప్పుడు నా దగ్గర వున్న యీ రెండు కాసుల మూటల్ని ఒకేసారి గెలుచుకోవచ్చు. నీ స్నేహితుడి దగ్గర ఇంకో కాసుల మూట వుంది కదా! దానితో నీ అదృష్టం పరీక్షించుకోవటం నీ ధైర్యం మీద ఆధారపడి వుంది," అన్నాడు.

పొట్టిదయ్యం ఆత్రంగా, "వెంటనే చెప్పు. ఆ పైన నేను ఏ సంగతీ చెపుతాను. ఏమిటా పై పందెం?" అంది.

"నా కుడికన్నుని నా ముందు పళ్ళతో ముట్టుకుని చూపిస్తాను. నమ్మకం లేదా?" అని సీతయ్య అడిగితే పొట్టిదయ్యం ఒక్క సారి ఆలోచించి, "అది ఎలా? అసాధ్యం!" అంది.

"అయితే పందెం కట్టటానికి సిద్ధమే నన్న మాట!" అని సీతయ్య అంటూ వుంటే పొడుగు దయ్యం పొట్టిదయ్యాన్ని మళ్ళీ పక్కకి పిలిచి, "ఈ మనిషి మోసాన్ని ఒకసారి చవి చూశాక కూడా, మళ్ళీ పందెం కట్టటానికి తయారవుతున్నావా?" నీ తెలివి తక్కువకి నవ్వొస్తూంది," అంది.

అందుకు పొట్టిదయ్యం, "యీ మనిషికి ఒక కన్ను గాజు అయినంత మాత్రాన ఆశ్చర్య పడనక్కర లేదు. రెండో కన్ను కూడా గాజుదేమోననని మనము అనుమానిస్తే, బయట పడేది మన వెర్రితనమే! పోగొట్టుకున్న కాసుల మూటని తిరిగి గెల్చుకోటానికి యింత కంటె మంచి అవకాశం రాదు," అంటూ సీతయ్యని పిలిచి, "ఆ చేస్తానన్నదేదో త్వరగా చేసి చూపించు," అని అడిగింది.

సీతయ్య వెంటనే తన కట్టుడు పళ్ళు పైకి తీసి, చేత్తో పట్టుకుని పొట్టిదయ్యానికి చూపిస్తూ, ముందు పంటివరస తీసి కుడి కన్నుకి తాకించి. "చూశావా, తెలివి తేటలు వుంటే, ఒక కాసుల మూటతో మరి రెండు కాసుల మూటల్ని ఎలా గెలుచుకోవచ్చునో!" అని పక పక నవ్వసాగాడు.

పొట్టిదయ్యం పొడుగుదయ్యం దగ్గరికి

వెళ్ళి పశ్చాత్తాపంగా, "చింతచెట్టు తొర్రలో ఎంతకాలం నుంచో పడున్న కాసుల మూటల్ని యీ మాయదారి మనిషి పాలు చేశాం!" అంది.

పొడుగుదయ్యం నవ్వి, "ఇప్పటికి మించి పోయిందేమీ లేదు. మనుషుల ముందు దయ్యాల తెలివి అంతంత మాత్రమేననీ వాళ్ళ జోలికి పోవటం కన్నా తెలివి తక్కువ మరొకటి వుండదని నువ్వు ఒప్పుకుంటే, యీ బంగారం అంతా వెనక్కి వచ్చే మార్గం చెపుతాను," అంది.

పొట్టిదయ్యం ఆశ్చర్యపోతూ వుంటే, పొడుగుదయ్యం పెద్దగా నవ్వి, "నీకు ముందే చెప్పాను కదా, మనుషులు జడుసుకునేది మన ఆకారాలకి కాని, తెలివి తేటలకి మాత్రం కాదని....త్వరగా పద. మన అసలు రూపాలతో యితడి ముందుకు వురుకుదాం!" అంది.

వెంటనే ఆ రెండు దయ్యాలు భయంకర దయ్యాల రూపాల్ని పొంది సీతయ్య వైపు వేగంగా నడిచాయి.

మూడు సంచుల్లోని కాసులూ కింద పోసి సంతోషంగా లెక్క పెడుతున్న సీతయ్య, ఎదురుగ్గా నిలబడ్డ దయ్యాలు రెండింటినీ చూచి అదిరి పడి, ఆ బంగారం అంత అక్కడే వదిలిపెట్టి కాలికి బుద్ధి చెప్పాడు.

పొట్టిదయ్యం, "అన్నా, మనుషుల వ్యవహారంలో జోక్యం కలిగించుకోవటం కన్నా, నీలాగ యీ చెట్టుని పట్టుకుని కాలక్షేపం చెయ్యటంలోనే సుఖం వుండేటట్లు కనపడుతూ వుంది," అంటూ పొడుగుదయ్యాన్ని అభినందించింది.

దయ్యాలు రెండూ చెట్టెక్కేసి కబుర్లలో పడ్డాయ్! ఆ తరవాత, ఎన్ని నాళ్ళూ, ఏళ్ళూ గడిచి పోయాయో, వాటికి తెలియనే లేదు.





# కిరీటం

నెపోలియను దగ్గరకు ఒక యువకుడు వచ్చి అతణ్ణి తెగ పొగడసాగాడు.

"నీకేం కావాలి?" అని అడిగాడు నెపోలియను.

"మీరు మాట తప్పని మహానుభావులని నాకు తెలుసు. నా కోరిక తప్పక చెల్లిస్తారని వచ్చాను." అన్నాడు యువకుడు.

"నీ కోరిక తప్పక తీరుస్తాను. ఏం కావాలో చెప్పు!" అన్నాడు నెపోలియను.

"మీ కిరీటం ఒక రోజు ధరించటానికి ఇవ్వండి," అని కోరాడు యువకుడు.

"సరే, రేపు రా. నిన్ను ఒక రోజు చక్రవర్తిని చేస్తాను," అన్నాడు నెపోలియను.

దానితో తాను చక్రవర్తి అయినట్లు ఎంతో మురిసి పోసాగాడు యువకుడు.

మరునటి రోజు పెద్ద ఆవరణలో విందు కోసం చాలామంది సమావేశం అయ్యారు. అక్కడ వున్న ఉన్నతాసనంపై యువకుణ్ణి కూర్చోపెట్టాడు నెపోలియను.

"ఈ విందు అనంతరం నీకు కిరీటం అలంకరిస్తాను. అంత వరకూ ఈ ఆసనం మీదే కూర్చోవాలి;" అని నెపోలియను చెపితే, "సరే!" అంటూ ఆనందంతో తల ఊపాడు యువకుడు.

చుట్టూ కలయ చూశాడు యువకుడు. ఆ ఆవరణ అంతా ఎంతో మంది పెద్దలతో నిండి ఉంది. తన జన్మ తరించిందని అనుకుంటూ, తల పైకి ఎత్తి చూశాడు యువకుడు. అతడి నెత్తిపై వ్రేలాడుతూంది ఒక కత్తి!

ఆ కత్తి, గుర్రం తోక వెంట్రుకతో కట్టబడిందని సులభంగానే గ్రహించాడు యువకుడు. గట్టిగా గాలి వీస్తే. తెగి నేరుగా తన నెత్తిపై అది పడుతుంది. దానితో తన తల తెగి ముక్కలవుతుందని అనిపించింది అతడికి. మెల్లగా విందు ముగిసింది.

నెపోలియను కాళ్ళపై పడి, "నాకు కిరీటం వద్దు ఏమీ వద్దు. బ్రతికి ఉంటే చాలు!" అన్నాడు గజగజ వణుకుతూ యువకుడు.

అప్పుడు నెపోలియను నవ్వి, "కిరీటం పెట్టుకోగానే సరి కాదు. అది నెత్తి మీద ఖడ్గం వంటిది అని గుర్తు వుంచుకోవాలి కూడా. అందుకే ఇలా చేశాను," అన్నాడు.

—బెహరా ఉమామహేశ్వరావు




## 17

[త్రిశరుడు సులభంగానే ఉగ్రభైరవుణ్ణి బోల్తా కొట్టిస్తాడు. తన నెమిలి సైన్యాన్ని బయటికి పంపి, ఉగ్రభైరవుడు తన చేత బంధించబడిన అవంతీసుందరిని ఆకర్షించేందుకు అలంకరించుకుంటూ వుండగా, రాజహంసగా జయసింహుడు మొదటి ప్రాకారంలోని భుధరుడి మెప్పు పొందుతాడు. అతడు కొన్ని రహస్యాలు జయసింహుడికి చెప్పటం మొదలు పెడతాడు. —తరవాత]

"ఆ తర్వాత. ప్రాకారంలో ఎవరూ ఉండరు. కాని, అందులో ఒక రూపం లేని భూతం ఉంటుంది. అది నిన్ను పట్టి చంపివేస్తుంది.

"దానిని దాటితే అప్సరసల ప్రాకారం వస్తుంది. వాళ్ళు నిన్ను లోబర్చుకొనేందుకు ఎన్నో విధాల ప్రయత్నిస్తారు. నీవు వారిని చూచి నవ్వావో. నాశనమై పోయినట్లే లెక్క!

"నిన్ను నవ్వించేందుకు వారెన్నో ఎత్తులు వేస్తారు. ఎన్నో రహస్య కథలు చెపుతూ వుంటారు. నీవు మాత్రం నవ్వ కూడదు.

"ఇకపోతే, ఏడవ ప్రాకారంలో నెమిళ్ళ సైన్యం ఉంటుంది. అవి ఇందాకనే ఎగురుకుంటూ శరభద్వీపానికి పోవటం నేను చూచాను. కాబట్టి, ఆ సైన్యం తిరిగి వచ్చే లోపల నీవు ఏడవ ప్రాకారం కూడా దాటగలిగితే నిన్ను ఆపేవారు వుండరు.

"కృతజ్ఞతలు. మరి మయూరద్వీపంలో వచ్చే కష్టాలేమిటి చెప్పి పుణ్యం కట్టుకోరాదా, భూధరుడా!" అంది రాజహంస.

"కాలు నేలకు తాకించకుండా సంచరించాలి. పన్నెండుమంది ఉగ్రభైరవ రూపులను జయించాలి. మిగిలిన వివరాలు నీకే తెలుస్తాయి. ముందు, ఈ ఏడు ప్రాకారాలను జయించు. నీకు శుభమౌతుంది," అన్నాడు భూధరుడు.

రాజహంస ఒక్క క్షణం కూడా ఆగకుండా వెళ్ళి, జలముఖుడి ప్రాకారంలోకి ప్రవేశించింది.

యం. ఉమాదేవి



ఇదిలా ఉండగా, అక్కడ అమరావతీ నగరంలో రాజాంతఃపురంలోని వారికి అందోళన ఎక్కువైంది. ముఖ్యంగా పరంతప మహారాజుకు దినం ఒక యుగంగా గడవ సాగింది. అవంతీసుందరిని అన్వేషించటానికి వెళ్ళిన వారిలో ఒక్కరూ తిరిగి రాలేదు. గురుచరణుల వారి వద్ద నుండి కూడా సమాచారం ఏదీ మళ్ళీ అందలేదు.

పైగా, మహారాణి కల్పనాదేవికి ఎంత కాలమని ఈ రహస్యం తెలియకుండా దాచిపెట్టి ఉంచటం? ఏ చెలికత్తె అయినా నోరు జారి అన్నదంటే ఇంతకాలం నుండి తాము చేసిన ప్రయత్నం అంతా వ్యర్థమై పోయినట్లే!

ఇలా మహారాజు మనోవ్యాధితో బాధపడుతూ వుండగా, కల్పనాదేవి పరంతపుడి దగ్గరికి వచ్చి, "ప్రభూ, నాకు ఒకసారి మన చిన్నారి అవంతిని చూడవలెనని ఉన్నది. ఆమెను ఒకసారి పిలిపించండి," అన్నది.

పరంతపుడి గొంతులో పచ్చి వెలక్కాయ పడినట్లు అయి, తేరుకొని, "దేవీ, బాలారిష్టాలు తీరే వరకూ ఆమె గురుచరణుల వారి వద్దనే ఉండటం మంచిది అనుకొన్నాం కదా! ఆమెను ఎప్పుడు పంపాలో స్వామివారే నిర్ణయిస్తారు!" అన్నాడు.

"అలా అయితే, ఒకసారి మనమే భరద్వాజాశ్రమానికి వెళ్ళి, అమ్మాయిని చూచి వద్దాం," అన్నది కల్పనాదేవి.

కల్పనాదేవితో అమ్మాయిని చూడటానికి వీల్లేవని పరంతపుడు ఎలా చెప్పగలడు?

"సరే, గురువుల వారికి కబురు చేసి, బయలుదేరుదాం." అంటూ మహారాజు వెంటనే గురుచరణుడికి ఒక లేఖ వ్రాసి నమ్మకస్థుడి ద్వారా పంపాడు.

గురుచరణుడు ఆ లేఖను చదివి, "భయం లేదు. కల్పనాదేవిని తీసుకొని రండి." అని మైత్రేయుడితో సందేశం పంపించాడు.

పరంతపుడికి ఆశ్చర్యం వేసింది. కల్పనాదేవి ఆశ్రమం లోనికి వెళ్ళి కుమార్తెను చూపమంటే గురుచరణుడు ఏమి చేయగలడు? ఏ ధైర్యంతో ఇలా రమ్మని కబురు పంపాడు? పరంతపుడు బరువుబాధ్యతలన్నీ భగవంతుడి



మీద ఉంచి, గురుచరణుడి సన్నిధికి మహా రాణితో సహా రథం మీద బయలుదేరాడు.

మహామంత్రి బృహస్పతిభట్టు మరొక రథంలో ప్రభువును అనుసరించాడు.

వారు భరద్వాజాశ్రమానికి చేరేసరికి చీకటి పడింది. అందరూ రథాలు దిగి ఆశ్రమం లోనికి ప్రవేశించారు. వారికి అప్పుడు ఏదో విచిత్రమైన నవ్వు వినిపించింది.

ముగ్గురూ పర్ణశాలకు బయటనే కొన్ని క్షణాలాగి కిటికీలో నుండి లోనికి చూచారు. గురుచరణుడు పర్ణశాల లోపల ముగ్గు వేసి చుట్టూ నిమ్మకాయలు పెట్టి మధ్యలో చిన్న సిద్ధుణ్ణి కూర్చోబెట్టాడు. మంత్రాలు చదివి అతడికి ధూపం వేశాడు.

"చూడు, చూడు, అంజనదేవతా! జయ సింహుడు ఎక్కడ ఉన్నాడు?" అని ప్రశ్నిం చాడు గురుచరణుడు.

చిన్నసిద్ధుడు తలను ఊగిస్తూ, "మానవు లకు, దేవతలకు, దానవులకు అందని మయూరద్వీపం, అంజనానికి కూడా అందని మయూరద్వీపం ... లోని మయూరాక్షి .... మయూరాక్షి మక్కున మాయాదర్పణం.... హా హా హా హా హా మాయాదర్పణం," అన్నాడు.

"ఓ అంజనదేవతా! జయసింహుణ్ణి చూడు," అని గురుచరణుడు అంటే. చిన్న సిద్ధుడు, "రాజకుమారుడు కనపడటం లేదు. రాజహంస కనపడుతున్నది.... కామరూప ధారి అయిన జయసింహుడు రాజహంసగా మొదటి ప్రాకారాన్ని జయించాడు. భూధరుణ్ణి చెర నుండి విడిపించాడు. జలంధర రాక్ సుణ్ణి ఎదుర్కొనే నిమిత్తం రెండవ ప్రాకారం లోనికి రాజహంస ప్రవేశించింది!" అన్నాడు.

"ఆ పైన ఏం జరిగింది? అంజనదేవతా!" అని అడిగాడు గురుచరణుడు.

"హా హా హా హా హా!" అని చిన్నసిద్ధుడు నవ్వుతూ, తల తిప్పుతూ, అటూ ఇటూ ఊగుతూ, "రాజహంస రెండవ ప్రాకారం లోనికి ప్రవేశించింది. రాజహంసను చూచిన జలధరుడు ఆకాశం ఎత్తున ఎగిరి పడ్డాడు. తాటిచెట్టు ఎత్తు ప్రమాణంగల అలలతో రాజహంసను ముంచటానికి ప్రయత్నిస్తు



న్నాడు. అదిగో, రాజహంస ఏదో మంత్రం చదువుతున్నది! 'జలధరులవారూ, నేను మీ భూధరుడి స్నేహితుణ్ణి. నన్ను జల ప్రళయంలో ముంచవద్దు. భ్రూవిష్వక్షట్, భ్రూవిష్వక్షట్,' అని అంటున్నది రాజహంస," అన్నాడు.

"ఆ పైన ఏమైంది అంజనదేవతా! చెప్పు." అన్నాడు గురుచరణుడు.

"అలలు శాంతించాయ్! ఆకాశంలోని రాజహంస చిరునవ్వు నవ్వుతున్నది. జలధరుడు రాజహంసను మూడవ ప్రాకారం లోనికి వదిలి పెట్టాడు. మూడవ ప్రాకారం వాయుముఖుడు వుండేది. సుడిగాలి. పెను గాలి.... భయంకర గాలి హా హా హా హా...."

అంటూండగా, చిన్నసిద్ధుడి ధ్యానం ఛెదిరి పోయి, స్పృహ తప్పి మంత్రాల ముగ్గులో పడిపోయాడు.

'ఇప్పుడేం చేయాలి?' అని గురుచరణుడు ఆలోచిస్తూండగా, ప్రభువుల రాకను నివే దించారు శిష్యులు.

గురుచరణుడు ఏమీ కంగారు పడకుండా వెళ్ళి వారిని లోనికి ఆహ్వానించాడు.

"నా చిట్టి తల్లి ఏది? ఎక్కడి నా అవంతి?" అన్నది కల్పానాదేవి ఆదుర్దాగా.

"ఇక్కడే ఉన్నానమ్మా! మీ రాకను గురు దేవులు నాకు ముందే చెప్పారు," అంటూ కుటీరంలో నుండి వచ్చి, తల్లిదండ్రులకు పాదాభివందనం చేసింది అవంతీసుందరి.

పరంతపుడూ, బృహస్పతిభట్టూ ఒకరి ముఖాలు ఒకరు చూచుకున్నారు. తమ కళ్ళను తామే నమ్మలేక పోయారు.

కల్పానాదేవి అవంతీసుందరిని కౌగిలించు కొని పరవశించి పోయింది. కుమార్తె యోగ క్షేమాలను విచారించింది. అవంతీసుందరి యుక్తియుక్తంగా జవాబులు చెప్పింది తల్లికి. దానితో తల్లి దిగులంతా తీరిపోయింది.

మహారాజును గురుచరణుడు తన ఏకాంత మందిరం లోనికి తీసుకొని వెళ్ళి, "మహారాజా, నీవు ఏమీ భయపడ నద్దు. అంతా సవ్యం గానే జరుగుతుంది. ఇందాక నీవు విన్న అంజనంలోని విషయాలు రాజకుమారి



అన్వేషణకు సంబంధించినవే. నా శిష్యుడు జయసింహుడు ఆమెను త్వరలో తీసుకొని రాగలడనే నముతున్నాను," అన్నాడు.

"గురువర్యా, ఇంతకూ అమ్మాయి జాడ తెలిసిందా?" అన్నాడు పరంతపుడు.

"కొంత వరకూ తెలిసినట్లే! అంజనాన్ని బట్టి, ఆమె ప్రస్తుతం మయూరద్వీపంలో ఉన్నట్లు ఊహిస్తున్నాను. పూర్తి వివరాలు త్వరలో నేనే చెప్తాను," అన్నాడు గురుచరణుడు.

"మరి మహారాణికి కనబడినది ఎవరూ?" అని అడిగాడు పరంతపుడు.

ఆ ప్రశ్న విని గురుచరణుడు నవ్వి, "ఆమె మాయా అవంతీసుందరి. కల్పనాదేవిని ఓదార్చటం కోసం తాత్కాలికంగా ఈ భ్రమను కల్పించాను," అంటూ ఎందుకో ఉన్నట్లుండి ఒక్క క్షణం ఆగి పోయాడు.

తళుక్కున అతడి మనస్సులో ఏదో ఊహ స్ఫురించింది. మరు క్షణమే అతడు కళ్ళు మూసుకొని ఏదో ఆలోచిస్తూ, తనలో తాను మాట్లాడుకుంటున్నట్లు అనిపించింది పరంతప మహారాజుకి.

అది గ్రహించి పురంతపుడు. "కులపతీ, మరి నాకు సెలవు ఇప్పిస్తారా?" అని వేడుకున్నాడు.

"మంచిది మహారాజా! నీవు వచ్చి పని అయింది కదా! మరి కొద్ది కాలం కల్పనాదేవికి ఈ విషయం తెలియకుండా కాపాడండి. మన ఆశ్రమం లోనికి నిజమైన అవంతీ సుందరిని తీసుకొని వచ్చి చూపిద్దాము," అన్నాడు గురుచరణుడు.

ఆ ఆత్మవిశ్వాసాన్ని చూచి, పరంతపుడు కూడా ధైర్యం తెచ్చుకొన్నాడు. ఆ తర్వాత, అందరూ తిరిగి రాజధానికి వెళ్ళి పోయారు.

ఆ తర్వాత. గురుచరణుడు తన పూజా మందిరం లోనికి వెళ్ళి ఏకాంతంగా కూర్చున్నాడు. భగవతిని ధ్యానించి కన్నులు మూసుకొని. జయసింహుడికి ఒక సంకేతం పంపాడు.

అప్పుడు జయసింహుడు మూడవ ప్రాకారములో ప్రవేశించాడు. ఆదంతా భయంకరమైన సుడిగాలులతో నిండి ఉంది.

"దీనిని ఎలా జయించాలా?" అని ఆలోచిస్తూన్నంతలో జయసింహుడి మనస్సులో తళుక్కున ఏదో ఊహ మెరిసింది. దాని గురించి కొంత సేపు తర్కించుకున్నాడు.

'లోపల అవంతీసుందరి ఉండి ఉంటుంది. ఆమెను తప్పించాలి అంటే ఒక మాయా అవంతీసుందరిని సృష్టించటం మంచిది. లేదా, నేనే అవంతీసుందరిగా మారి నా వేషంలో అవంతీసుందరిని శరభద్వీపానికి పంపటం ప్రయోజనకరంగా ఉండవచ్చు.' అని అనుకున్నాడు జయసింహుడు.

ఉన్నట్టుండి, ఈ ఊహ తనకు ఎలా వచ్చిందో జయసింహుడికి అర్థం కాలేదు. బహుశః గురుదేవుడి అనుగ్రహం వలన తనకు ఈ సంకల్పం కలిగినట్లు ఊహించాడు. కష్ట కాలంలో ఆశీర్వాదమూ సంకేతాలూ కూడా గురుదేవుడు తనకు అందేటట్లు చేస్తున్నారు.

మాయా అవంతీసుందరి మాట అటుంచి ముందు వాయుప్రాకారాన్ని ఎలా దాటాలా అని ఆలోచించాడు జయసింహుడు.

ఈ గాలి మొత్తం భయంకరమైన హోరుతో నిండి ఉంది. నిజానికిది గాలి కాదు. ఒక రాక్షసుడి నిట్టూర్పులు, ఉచ్ఛ్వాసనిశ్వాసాలు!

దానికి విరుగుడుగా జయసింహుడు మధుర గానం ఆలపించాడు. గంధర్వుడు తనకి ఇచ్చిన విద్యాప్రభావంతో వాయు మండలాన్ని మధుర నాదంతో నింపి వేశాడు. ఆ సంగీత ప్రభావం వలన వాతావరణమంతా ఎటు చూచినా, ఆనందతరంగాలతో ఓలలాడు తున్నది. చూస్తూండగానే సుడిగాలి తగ్గింది.



"ఏయ్ పక్షీ! ఎవరు నువ్వు? పాటపాడుతూ నా ప్రాకారంలోనికి రావటానికి ఎంత ధైర్యం?" అన్న మాటలు వినపడినాయి రాజహంసగా వున్న జయసింహుడికి.

"అయ్యా, నేను దారి తప్పి ఇలా ప్రవేశించాను. వచ్చిన దాన్ని ఆ మయూర ద్వీపాన్ని కూడా చూచి పోదామని ఆశ కలిగింది. నా వలన మీకు ఎట్టి అపకారమూ జరగదు. చిన్న పక్షిని. నా మీద మీకు ఎందుకు కోపం?" అన్నది రాజహంస.

"నీ వలన నాకు అపకారం జరగక పోవచ్చు. కాని, మా వలన నీకు అపకారం జరుగుతుంది. ఈ తర్వాతి ప్రాకారంలో అగ్నిముఖుడు అనే రాక్షసుడు ఉన్నాడు. ఇతడు నిప్పులు కురిపిస్తూ వుంటే నీవు మల మల మాడి పోతావు. ఇక మయూరద్వీపం లోనికి ఎలా వెళతావు?" అని అడిగాడు వాయుముఖుడు.

"మీరే ఏదో పరిష్కారం చూపించాలి." అంది రాజహంస.

"మంచిది. నిన్ను చూస్తే ముద్దు వస్తుంది. నీవు అగ్నిప్రాకారం లోనికి ప్రవేశించగానే ఒక నిప్పులు కక్కే జంతువు నీ మీదికి వస్తుంది. దాన్ని తప్పించు కోవటం అసంభం. అది నిప్పులను ఉమ్ముతూ, 'అ ఆ ఇ ఈలు అంటే ఏమిటి? అది వ్రాసిన ఒక ఫలకం ఉన్నదా?,' అని ప్రశ్నిస్తూంటుంది. దానికి సమాధానం చెప్పక పోతే మింగి వేస్తుంది," అన్నాడు వాయుముఖుడు.

దానితో, జయసింహుడికి ఆ సమాధానం ఏమిటో స్ఫురించింది. అంతే కాదు, ఈ అగ్ని ముఖుడికీ నారికేళద్వీపానికీ ఏదో సంబంధం ఉండాలని తోచింది. అది ఎలాంటిది అయి వుంటుందా అని ఓ క్షణం ఆలోచించాడు. తోచలేదు అతడికి.

—(ఇంకా ఉంది)





# హంసల జంట

పూర్వం తామ్రలిప్తిలో విద్యుల్లేఖా ధర్మసేనుడూ అనే భార్యాభర్తలు వుండే వారు. ధర్మసేనుడు వ్యాపారం చేసి, లక్షలు గడించాడు. అయితే, కష్టపడి సంపాదించిన ఆ డబ్బును ఒకనాడు దొంగలు పడి దోచుకుపోయారు. దానితో, ఆ దంపతులకు జీవితం మీద నిరాశ కలిగింది. ఊరికి వెలుపలి ఒక కొలను సమీపంలో చితిని రగిలించారు.

ఆ కొలను లోని హంసలు వారు చేస్తూన్న వింతను చూస్తూన్నాయి. ఈ వైశ్య దంపతులు కూడా ఆ హంసలను చూస్తూ, చితి మీదికి ఎక్కారు. మరు క్షణంలో వారు ప్రాణాల్ని కోల్పోయారు.

అయితే, చివరి క్షణాల్లో హంసల మీద దృష్టి పెట్టి చనిపోవటం వల్ల, పునర్జన్మలో వారు ఇద్దరూ రెండు హంసలుగా ఆ తామర కొలనులోనే పుట్టారు.

ఈ రెండూ ఆ కొలనులో కొంత కాలం పాటు సుఖంగా జీవించాయి. ఇంతలో వర్షా కాలం వచ్చింది. ఈ రెండు హంసలూ తామరకొలనుని వదలి పెట్టి, దగ్గరలో ఉన్న ఒక ఖర్జూరపు చెట్టు మీద గూడు కట్టుకొని నివసింపసాగినాయి.

ఇలా కొన్నాళ్ళు గడిచాయి. ఒకనాడు ఆడహంస ఎక్కడికో వెళ్ళిన సమయంలో తుఫాను వచ్చింది. పెనుగాలులు వీచాయి. గాలి తాకిడికి ఖర్జూరపు చెట్టు కూలి పోయింది.

దానితో మగహంస చెట్టుని వదిలి, ఆడ హంసని వెతుక్కుంటూ వెళ్ళింది. అయితే, అప్పుడు తుఫానులో చిక్కుకొన్న ఆడహంస ఒక పర్వత శిఖరాన్ని చేరింది. అక్కడ చలికి గజగజ వణకుతూ ఉన్నది. మగ హంస అన్ని దిక్కులూ తిరిగి అతి కష్టం మీద ఆ పర్వతం వద్దకు చేరింది. అక్కడే వున్న భార్యను చూచి ఎంతో సంతోషించింది.

యం. వి. శ్రీలేఖ



ఖర్జూరపు చెట్టు మీది తమ గూడు కూలి పోయిన వృత్తాంతాన్ని భార్యకు చెప్పింది మగహంస.

ఆ కొండ మీదనే వారిరువురూ ఉండి పోవాలని నిశ్చయించు కొన్నారు. అయితే, అది సురక్షిత ప్రాంతము కాదని ఆ పక్షులకు తెలియదు.

అలవాటు ప్రకారం ఆ ప్రాంతంలో సంచరించే బోయవాడు ఒకడు, ఒకనాడు ఈ హంసల్ని చూచి, చాలా సంతోష పడ్డాడు. ఖండ చాటు నుండి బాణాన్ని వదిలాడు.

అది తగిలి, ఆడహంస గిలగిల కొట్టుకొని క్రింద పడిపోయింది. మగహంస రివ్వున ఎగిరి దూరంగా పోయింది.

బోయవాడు ఆడహంసని పట్టుకొని కొండ దిగి, తన గుడిసెకు తీసుకు పోతున్నాడు. అక్కడ దానిని బాగా కాల్చుకుని తిందామని అతడి ఉద్దేశం.

ఇంతలో కొందరు రక్షకభటులు కత్తులు పట్టుకొని, గుర్రాల్ని ఎక్కి ఎదురుగా వస్తున్నారు. వాళ్ళని చూచేసరికి, బోయవాడికి భయం కలిగింది. అందమైన ఈ హంసను వాళ్ళు గుంజుకొని ఆహారంగా పట్టుకుపోతారేమోనని అనుమాన పడ్డాడు.

అందుకని ప్రక్కనే ఉన్న ఒక పొదలో దానిని దాచిపెట్టి, దూరంగా వెళ్ళి నిలబడ్డాడు బోయవాడు.

విచిత్ర మేమంటే, ఆ పొద లోపలి గడ్డిలో సంజీవకరణి మూలిక ఒకటి ఉన్నది. ఆ మూలికా స్పర్శతో ఆడహంసకు ప్రాణం వచ్చింది. ఇంకేం, ఒక్క క్షణమైనా ఆగకుండా అది రివ్వున ఎగురుకుంటూ గగన మార్గంలో వెళ్ళి పోయింది.

వేటగాడు గుడ్లు అప్పగించి ఇదంతా చూస్తున్నాడు.

ఇది ఇలా ఉండగా, మగహంస అలా పోయి పోయి, కొంత దూరంలో ఒక తామర కొలను చూచింది. అందులో కొన్ని హంసలు వున్నవి. వాటి దగ్గరికి చేరి తన గోడు వినిపించింది మగహంస. ఆ హంసలు ఈ క్రొత్త హంసను ఓదార్చి తమ గుంపులలో

కలుపు కొన్నాయి. అయితే, ఈ మగహంస దురదృష్టం అక్కడికి కూడా తరుముకుంటూ వచ్చింది.

తెల్లవారక ముందే మరో బోయవాడు కొలను ప్రక్కనే వలపన్ని వెళ్ళి పోయాడు. ఈ హంసలు అన్నీ అహారం మీది ఆశతో వల్లో చిక్కుకొని పోయాయి. బయట పడే మార్గం లేక ప్రాణ భయంతో గిల గిల కొట్టు కుంటున్నవి.

ఇంతలో, సంజీవకరణితో బ్రతికిన ఆడ హంస తన భర్తను వెతుక్కుంటూ ఈ తామర కొలను వద్దకు వచ్చింది. వలలో చిక్కిన తన భర్తను గుర్తు పట్టింది. తాను ఎట్లా బ్రతికినదీ భర్తతో చెప్పింది.

మగహంస కన్నీళ్ళు పెట్టుకొని, "దగ్గరికి రాకు. ఇది వల. మేము ఇందులో చిక్కు బడి పోయాము. దూరంగా వెళ్ళి పో," అని హెచ్చరించింది.

ఆడహంస భర్తను బ్రతికించుకొనేందుకు ఏదైనా మార్గం ఆలోచించింది. అప్పుడు దానికి ఒక ఉపాయం స్ఫురించింది. ఈ వల ఒక చెట్టు ప్రక్కనే పరచబడి ఉంది. ఆ చెట్టు మీద ఒక కోతి కూర్చుని ఉంది. ఆడహంస వేగంగా పోయి, ఆ కోతి కంటిని పొడిచింది.

కోతి చెట్టు మీది నుండి బాధతో క్రింద పడి పోయింది. సరిగ్గా అది వల మీద పడింది. దాని కాళ్ళు వలలో చిక్కుకున్నది. ఇంక ఊరుకుంటుందా? వలనంతా కొరికి చిందర వందర చేసింది. వలలో చిక్కుకున్న హంస లన్నీ రివ్వుమని ఎగురుకుంటూ బయ టికి వచ్చాయి.

ఇలా చక్కని ఉపాయంతో ఆడహంస తన భర్తను విడిపించుకొని, భర్తతో కలిసి ఎక్కడికో వెళ్ళి చాలాకాలం సుఖంగా జీవించింది.






# అసలు సంగతి

చీనాదేశంలోని ఒక గ్రామంలో చెంఘిజ్ అనే యువకుడు వుండే వాడు. అతడికి ప్రగల్భాలు తప్ప, మరో మాట నోట రావని అంతా చెప్పుకునే వారు. అతడు అంటే అభిమానం వున్న షంషేర్ అనే వృద్ధుడు మాత్రం అతడి మాటల్ని ఈసడించకుండా శ్రద్ధగా వినేవాడు.

ఇలా ఉండగా, ఒక రోజున చెంఘింజ్ ఎక్కడికో వెళ్ళి షంషేరింటికి వచ్చి, "తాతా, బాగా అలసి పోయాను. నీ యింట్లో ఏమైనా ఉంటే తినటానికి యివ్వ?" అన్నాడు.

షంషేర్ ఇచ్చిన ఫలాలూ అవీ తిని అక్కడే నిద్ర పోయాడు చెంఘిజ్. అంత అలసట ఎందుకు కలిగిందో తెలియక ఆశ్చర్య పడుతూ షంషేర్ ఇంట్లోంచి బయటకు వచ్చే సరికి, కొంత మంది గ్రామస్థులు అక్కడికి వచ్చి, అతడి గురించి అడిగారు.

"చెంఘిజ్ తో పనేమిటి మీకు?" అంటూ షంషేర్ అడిగితే, "అతణ్ణి సన్మానించాలి." అంటూ వాళ్ళు జరిగిన విశేషం చెప్పుకొని వచ్చారు.

ఆ గ్రామానికి రోజూ ఒక దొంగ వచ్చి వెళుతున్నాడు. ఎలా వస్తాడో ఎప్పుడొస్తాడో తెలియదు. రోజూ ఒకరింట్లో దొంగతనం జరుగుతూ వుంది.

గ్రామాధికారి చెంఘిజ్, "ఊరికే గొప్పలు చెప్పుకొనటం కాదు. చేతనైతే నువ్వు దొంగను స్వయంగా పట్టరాదూ?" అని సవాలు చేశాడు.

"దొంగను పట్టటటం ఏం కష్టం కాదు. అందుకు తెలివిని ఉపయోగించాలి. ఊరి చివర లోతైన గొయ్యి తవ్వి, దాని మీద తెలియకుండా ఆకులు కప్పి, ఓ చిన్న డబ్బుల మూట పెట్టామంటే దొంగ గోతిలో పడతాడు," అన్నాడు చెంఘిజ్.

ఆ రాత్రే గునపం పట్టుకుని అతడు ఊరి

చివరకు వెళ్ళాడు. తెల్లవారి చూస్తే నిలువెత్తు గోతిలో ఆ దొంగ పడి ఉన్నాడు!

షంషేర్ అంతా విని, "ఇది చెంఘిజ్ పనై ఉండదు. రాత్రి నాకు పిడుగు పడిన చప్పుడు వినిపించింది. ఆ గొయ్యి పిడుగు వల్ల ఏర్పడి ఉంటుంది. రాత్రి పూట ఎప్పుడూ లేని గోతిని చూసుకోక పోవటం వల్ల దొంగ అందులో పడి ఉంటాడు." అన్నాడు.

చాలామంది అది నమ్మలేదు.

షంషేర్ చెంఘిజ్‌ని లేపి, "రాత్రి నువ్వు గునపం తీసుకుని వెళ్ళి ఏం చేశావో చెప్పు," అని అడిగాడు.

"ఊరి చివర గొయ్యి తీద్దామని వెళ్ళాను. కాసేపు పని చేసేసరికి దయ్యము ఒకటి వచ్చింది. రాత్రి తెల్లవార్లూ దెబ్బలాడుతూ కూర్చున్నాను. దిక్కుమాలిన దయ్యం గొయ్యి తీయనీయ లేదు!" అన్నాడు చెంఘిజ్.

అతడు చెప్పిన వివరాలను బట్టి అతడు వెళ్ళింది కూడా ఊరి చివర మరో పక్కకని అందరికీ అర్థమయింది. అక్కడ ఏ చెట్టునో చూచి దయ్యమని భ్రమించి భయపడి ఏ పనీ చేయకుండా ఓ మూల కూర్చుని, తెల్లవార గానే అతడు ఊళ్ళోకి పారిపోయి వచ్చాడని అందరికీ అర్థమయింది.

అంతా వెళ్ళి పోయాక, అసలు విషయం చెంఘిజ్‌కు తెలిసి. "తాతా, ఆ గొయ్యి నేనే తీశాను అని వాళ్ళు అంటూంటే, నువ్వు ఒప్పేసుకుని ఉంటే, నాకు ఎంతో పేరు వచ్చేది కదా!" అన్నాడు బాధగా.

"కాస్త పని చేస్తే బోలెడు ప్రగల్భాలు పలుకుతావు. నువ్వు దొంగను పట్టేటంత గొయ్యి తీస్తే నాకు చెప్పకుండా వుంటావా?" అన్నాడు షంషేర్.

ఈ మాటలు వినగానే చెంఘిజ్‌కు చచ్చేటంత అవమానమయింది. ఆ తర్వాత నుంచి అతడు ప్రగల్భాలు చెప్పటం మానేశాడు.





# గురువుప్రార్థన

నిశానాధుడికి తల్లి గారాబం వల్ల చదువు రావటం లేదు. తండ్రి వాణ్ణి దూరప్రాంతాల గురుకులానికి పంపాడు. అక్కడ ఎటువంటి వాడికైనా చదువు చెప్పగల ధీశాలి అయిన జ్ఞానానందుడనే గురువు వున్నాడు.

అతణ్ణి కొన్ని ప్రశ్నలు వేసి," నీ మెదడు మొద్దు బారి పోయింది. ముందుగా నీవు ఏకాగ్రతను సాధించాలి. ప్రతి రోజూ ఉదయం చన్నీళ్ళలో స్నానం చేసి చిన్న గోచీ మాత్రం ధరించి, నేను చెప్పిన మంత్రాన్ని సూర్యోదయం వరకూ మననం చేస్తూ వుండు. ఆ తర్వాత నుంచీ నీకు చదువు చెపుతాను," అన్నాడు జ్ఞానానందుడు.

ముందుగా నిశానాధుడు అలాగే చేయాలని అనుకున్నాడు. అయితే, గోచీతో ఉన్న తనని మిగతా శిష్యులు వేళాకోళం చేయటం వల్ల, నిశానాధుడు గురువుకు ఇది చెప్పుకున్నాడు.

"నీలో ఏకాగ్రత ఉంటే నీ చుట్టు పక్కల ఏం జరుగుతున్నదీ తెలియదు. ముందు ఏకాగ్రతను సాధించు. అందుకే నా ఇతర శిష్యులను వేళాకోళం చేయమని నేనే చెప్పాను," అన్నాడు జ్ఞానానందుడు.

ఆ తర్వాత, ఈ విషయం చెప్పుకోలేదు నిశానాధుడు. అయితే, ఎంతకాలం గడిచినా జ్ఞానానందుడు తనకు చదువు ప్రారంభించ మనటం లేదు.

ఓ రోజున అతడు గురువుతో, "గురువర్యా' నేను ఇక్కడకు వచ్చి ఆరు మాసాలు గడిచింది. నేను ఇంకా మంత్రపఠనంలోనే ఉన్నాను. చదువు ఎప్పుడు ప్రారంభిస్తానో తెలియటం లేదు," అన్నాడు.

జ్ఞానానందుడు మందహాసం చేసి, "ఏకాగ్రత కుదరటం లేదు నీకు. ఉదాహరణకు చలి తెలుస్తూంది. ఇతరుల మాటలు వినబడుతున్నాయి. అది ఏకాగ్రత అనిపించుకోదు," అన్నాడు.

"గురువర్యా, మీరు పొరబడుతున్నారు. నేను చలి గురించీ, తోటివారి వేళాకోళం గురించీ ఫిర్యాదు చేయటం ఎప్పుడో మాని వేశాను కదా!" అన్నాడు నిశానాధుడు.

"అది నిజమే! అయితే ఏకాగ్రతలో సమయం తెలియకూడదు. నీవు సరిగ్గా సూర్యోదయం కాగానే మంత్రపఠనం మానేస్తున్నావు. అంటే సూర్యోదయం గురించి ఎదురు చూస్తున్నంత శ్రద్ధగా మంత్రపఠనం చేయటం లేదు. ఏకాగ్రతలో మంత్రపఠనం చేస్తూంటే, నీకు సూర్యోదయం గురించి తెలియదు," అన్నాడు జ్ఞానానందుడు.

"అలా ఎలా వీలవుతుంది? మీరు నాకు చదువు చెప్పలేక ఇలాంటి షరతులన్నీ పెడుతున్నారు. మీది పక్షపాత బుద్ధి. నాకు డబ్బు లేదని నన్ను హీనపరుస్తున్నారు." అన్నాడు నిశానాధుడు కోపంగా.

జ్ఞానానందుడు వెంటనే, "ఆ భగవంతుడే నిన్ను రక్షించగలడు," అంటూ కళ్ళు మూసుకుని దైవప్రార్థన చేశాడు.

నిశానాధుడు వెటకారంగా నవ్వి," నాకు చదువు చెప్పటం మీకు చేతకాక, ఆ భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నారా?" అన్నాడు.

"నీకు చదువు రావాలని నేను దైవప్రార్థన చేయటం లేను. ఏకాగ్రతను అలవర్చుకోనిదే నీకు ఎలాగూ చదువు రాదు. నిజానికి గురుదూషణకు మించి శిష్యుడికి వేరే పాపం వుండదు. నీకు చదువు రానందుకు నువ్వు నన్ను దూషించావు. ఆ పాపం నిన్ను అంటకుండా చేయమని నేను దైవప్రార్థన చేసుకున్నాను." అన్నాడు జ్ఞానానందుడు.

ఈ మాటలతో నిశానాధుడి కళ్ళు తెరుచుకున్నాయి. తనని క్షమించమని కోరుతూ గురువు కాళ్ళ మీద పడ్డాడు. తర్వాత గురువు చెప్పిన విధంగా ఏకాగ్రతను సాధించి, ఆ పైన చక్కగా చదువుకున్నాడు.



# బొమ్మల సంభాషణ

ఈ బొమ్మలోని వాళ్ళు ఏం మాట్లాడుకుంటే నవ్వు వస్తుందో ఆ సంభాషణ వ్రాసి, ఈ సంచిక విడుదలైన పది రోజులలోగా పంపకోరుతున్నాం. బాగున్న అన్నింటిని ఎన్నుకొని ఒకోదానికి రూ 15 పంపుతాం. సంభాషణలు కార్డు మీద మాత్రమే వ్రాసి పంపాలన్నది షరతు.

బొమ్మలసంభాషణ, బొమ్మరిల్లు, మద్రాసు - 26.





## ప్రశ్నలు

1. చంద్రుడు పెరుగుట తరుగుట ఎందు వలన జరుగుతుందో తెలుపగలవా?
2. అమెరికాలోని 'రెడ్ ఇండియన్స్' వాడే భాషలు ఎన్నో చెప్పగలవా?
3. పదహారు నిలువుల ఎత్తులోగల పై కప్పు భాగములో చిత్రాలు గీచిన వ్యక్తి పేరేమిటి?
4. 'రెడ్ వుడ్' చెట్లు ఎక్కడ వున్నాయో తెలుపగలవా?



## జవాబులు

1. భూమి చుట్టూ చంద్రుడు తిరగటం వల్ల ఈ విచిత్రం జరుగుతూ వుంది.
2. అవి నూటికి పైగా వుంటాయి. అవి ఇప్పటికీ వాడుకలో వున్నాయి.
3. మైకల్ ఏంజిలో. అతడు బైబులు లోని కథల్ని ఓ చర్చి పై కప్పులో అద్భుతంగా చిత్రించాడు.
4. అమెరికా పశ్చిమ తీరంలో వున్నాయి. ఇవి వంద మీటర్ల ఎత్తుకు పెరుగుతాయి.

Edited and published by Vijaya Bapineedu, 80, Dhanalaxmi Colony, Madras-26. Phone : 422233 and Printed by N. Navin Chandran at S. R. Offset Art Printers, Madras-21. Phone : 552462.